Vīrayya, Peddibhoṭla

Amerikā vartakacaritra

Bejavāḍa, 1913

Record no. 792

వీరయ్య, పెద్దిభొట్ల.
అమెరికా వర్తకచరిత్ర / పెద్దిభొట్ల వీరయ్యచే రచియింపంబడినది.- 1. కూర్పు.- బెజవాడ : బి. కే. స్వామి, 1913.
4, 64 p. ;18 cm.
Record no. 792

Vīrayya, Peddibhoṭla.
Amerikā vartakacaritra / Peddibhoṭla Vīrayyacē raciyimpambaḍinadi.- 1. kūrpu.- Bejavāḍa : Bi. Kē. Svāmi, 1913.
4, 64 p. ;18 cm.
Record no. 792

*

# అమెరికా వర్తక చరిత్ర.

పెద్దిభొట్ల వీరయ్య, బి.ఏ., బి.ఎల్.,
చే రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

బెజవాడ
వాణీ ముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామిచే
ముద్రింపఁబడియె.

 1913. [వెల 0.4.0.

# అమెరికా వర్తక చరిత్ర.

పెద్దిభొట్ల వీరయ్య, బి. ఏ., బి. ఎల్.,
చే రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామి చే
ముద్రింపఁబడియె.

1913.



[వెల 0-4-0.

*

# పీఠిక.

*

ఆంధ్రదేశమున అమరావతి, ధాన్యకటకము, విజయనగరము, రాజమహేంద్రవరము మొదలగుపట్టణముల ప్రాచీన చరిత్రాంశములును కృష్ణదేవరాయలు మొదలగు రాజుల యౌన్నత్యమును విదేశములతో బూర్వము చేయబడిన వర్తకవ్యాపారముల విరివినిగురించియు తెలిసికొన్నప్పుడు నాహృదయ మెటుల కొట్టుకొనెనో వర్ణించజాలను. పాశ్చాత్యదేశముల కలిమికి వర్తకవ్యాపారములు మూలాధారములుగ మన కన్నులకు గన్పడుచుండ నాంధ్రదేశమునకుసహితము భావి కాలమున వర్తకవ్యాపారములయందు ప్రఖ్యాతిగాంచుట కవకాశము గలుగవచ్చుననెడి దృఢనమ్మకము నామనంబుననాటియుండుటంజేసి నవీనకాలమందు నాగరికతను జెందిన దేశములలో వన్నెకెక్కిన బ్రిటను, జపాను, అమెరికా మొదలగువారి వర్తకవాణిజ్యముల యభివృద్ధినిగురించి తెలిసికొనుట ఆంధ్రులకు కర్తవ్యంబని తలంచి యాంగ్లేయభాషయందలి కొన్ని గ్రంథములను నాకుగల విరామకాలమందు జదివి నాశక్తి కొలది నాంధ్రభాషలో నప్పుడప్పుడు బందరులో ప్రచురింపబడుచున్న కృష్ణాపత్రికకు వ్రాసియుంటిని. ఈప్రకారముగా నాచేత వ్రాయబడిన వ్యాసములను జదివిన నా మిత్రులు గొందరాచరిత్రలను పుస్తకరూపముగ బ్రకటించుటకు గోరియుండిరి. అన్ని చరిత్రలనుగలిపి యొక్కపుస్తకముగా బ్రకటిం

చిన గొనువారికి గష్టముగానుండుననియు నాచరిత్రలను విడిగా చిన్నపుస్తకములుగా జేయించవలసినదిగా నాకివ్వబడినసలహా నంగీకరించి చివరవ్రాసిన అమెరికావర్తకచరిత్రను ముందుగా బ్రచురించుటకు బూనినాడ. నేనువ్రాసిన చరిత్రల సంగతులు నాంగ్లేయగ్రంథకర్తల గ్రంథములనుండి వ్రాసినవేగాని యీ పనికి నేను పొందదగిన స్వాతంత్ర్యమేమియు లేదు. ఈ చరిత్రల విక్రయమువల్ల రాగల లాభమును బందరులోని జాతీయ కళాశాలకు జెందగలందులకై వీనియందు నాకుగల హక్కులను కళాశాలవారి కిచ్చియున్నాను. కాబట్టి యాంధ్రదేశమున జనించు ప్రతియాంధ్రుడును వర్తకాభివృద్ధికై ప్రపంచములో నగ్రగణ్యములైయున్న రాజ్యములవారు పడిన కష్టములును వారుచేసిన ప్రయత్నములును వారు పొందిన లాభములును దెలిసికొనగోరి పిమ్మట శక్తికొలంది దేశక్షేమకరములగు వృత్తులను బ్రోత్సాహపరిచి శీఘ్రకాలములో నాంధ్రదేశమును ముందునకు తేవలెననెడి కుతూహలమును కనబరచునటుల నీపుస్తకమును దీసికొని సాకల్యముగ జదివి యాంధ్రదేశముయొక్క భావిస్థితికిని జాతీయకళాశాలయొక్కయభివృద్ధికిని తోడ్పడగలందులకు గోరుచున్నాను.

ఆండ్రూకార్నెజీయను అమెరికాకోటీశ్వరునిచే వ్రాయబడిన ఆంగ్లేయగ్రంథమునుండి చాలాభాగముసంగతుల నీపుస్తకమున జేర్చియున్నందునను అమ్మహనీయుడు తొల్త దుకాణమును స్వయముగ చీపురుతో జిమ్ముచు దినమునకు గొన్ని అణాలనుమాత్రమే సంపాదింపగలిగినస్థితినుండి వర్తకవ్యాపారములవల్లనే కోటీశ్వరుడై లోకమునకు వర్తకవ్యాపారములు



మనుజునకుగాని సంఘమునకుగాని యెట్టియైశ్వర్యమును గలిగింపగలవో యందుకు నిదర్శనముగనున్నందునను వారియందు నాకుగల గౌరవమును కృతజ్ఞతను నాంధ్రమండలమునకు విశదపరుచుచున్నాను. సాధారణముగ నూటికి నొక్కడు విశేష ప్రజ్ఞావంతుడుండును. అట్టి ప్రజ్ఞావంతులలో నూటికి నొక్కడు శ్రద్ధతోను పట్టుదలతోను కష్టపడి పనిచేయువాడుండును. అట్టి శ్రద్ధాళువులలో కొందరికి మాత్రమే నూత్న ప్రయత్నములం దిచ్ఛయుండును. అటుల ప్రయత్నించువారిలో నూటికి నొక్కడు క్రొత్తకల్పనలను పద్ధతులను కనుగొనును. అట్టి పద్ధతులలో కొన్నిమాత్రమే లోకమునకు విశేషప్రయోజనకారులగును. ఆంగ్లేయుల నేతయంత్రములును అమెరికావారి యినుపయంత్రములును మిగుల ప్రయోజనకారులై ప్రపంచమునందలి వర్తకమును తారుమారుచేయుచున్నవి. విదేశవర్తకచరిత్రలను జదివెడి యాంధ్రులలో నెప్పటికైనను కొందరు ధీమంతులు బయలుదేరి యాంధ్రదేశమునకు మేలును కలుగజేయుదురనెడి నమ్మకముతో నీచిన్నిపుస్తకమును ప్రచురించుచున్నాను. అమెరికా పెద్దఖండమై రెండుభాగములుగ విభజింపబడి ప్రపంచమునందలి పశ్చిమార్ధగోళము నంతకును వ్యవహరింపబడు నామమైనను, ఉత్తరమెరికాఖండమునందు ప్రసిద్ధిగాంచిన సంయుక్తరాష్ట్రములనే నీపుస్తకమున నమెరికాదేశముగ వ్యవహరింపబడినటుల చదువరులకు తెలియగలదు.

ఈ చిన్నపుస్తకము నచ్చొత్తించుటకు నన్నుబ్రేరేపించి దీనిని ప్రకటించుటకు నచ్చుప్రతులను సరిజూచుటకును

నాకు మిక్కిలి సహాయము జేసిన అయ్యంకి వేంకటరమణయ్య గారికిని నే నచ్చునకిచ్చిన వారములోపల పుస్తకము నతిజాగ్రత్తతో దయారుచేయించిన వాణీ ప్రెస్సు ప్రొప్రైటరు దాసు కేశవరావుపంతులుగారికిని వారి సహకారులకును నెంతయు కృతజ్ఞుడనై యున్నాను.

పెద్దిభొట్ల వీరయ్య.




ఆవిరి యంత్రము.

# విషయ సూచిక.



సాగరోడ.

# ఉపోద్ఘాతము.

లోకమునందు భాగ్యవంతునికి బీదవానికి గల తారతమ్యము మనము జూచుచున్నాము. ధనము పూర్వార్జితమైనను స్వార్జితమైనను మనుజునకు సౌఖ్యదాయకమై యుండును. దరిద్రుని యవస్థ లనంతములు. కాని నిజముగ స్వశక్తివల్ల నభివృద్ధిజెందవలెనన్న దారిద్ర్యమే ముఖ్యమార్గముగ గన్పించుచున్నది. ప్రపంచమున ప్రఖ్యాతిగాంచిన మహనీయులలో బెక్కండ్రు బేదరికమునుంచి యభివృద్ధికి వచ్చియున్నారు. మనుజులలోవలెనే సంఘములలో సహితము దారిద్ర్యైశ్వర్యముల తారతమ్యములను మనముజూచుచున్నాము. లక్ష్మికొక్కచోట స్థిరనివాసము లేనప్పటికి సోమరులకు దూరముగుటకును కష్టపడి పనిజేయువారి నాశ్రయించి యుండుటకును నిచ్ఛగించును. సాధారణముగా ధన మార్జించుటకు నన్నివృత్తుల లోను వర్తకవ్యాపారములు ప్రధానములుగ నున్నవి. వర్తకమున ఖ్యాతిగాంచిన సంఘములే ప్రపంచములో నైశ్వర్యమున తులదూగుచున్నవి. పూర్వ మొకప్పుడు హిందూదేశము వర్తకవ్యాపారములను విరివిగజేసి విశేషమైశ్వర్యమును బొందియుండెను. ఇప్పుడు బ్రిటను, జర్మనీ, అమెరికా, జపాను మొదలగు దేశములే వర్తకవ్యాపారములం దగ్రగణ్యములుగనున్నవి. ఆదేశములవారి చురుకుదనమును కార్యాచరణాసక్తియును వారియొక్క ప్రస్తుతస్థితికి ప్రబలకారణములై యున్నవి. హిం

దూ దేశముయొక్క సంగతిసందర్భములకు నితరదేశములకు ననేకభేదము లుండవచ్చును. కాని వర్తక వ్యాపారములలో నభివృద్ధిజెందుటకు హిందువులు బూనినచో వారి కట్టి వృద్ధి కాగలదని నిశ్చయముగ నెంచవచ్చును. శైశవావస్థయందున్న వృత్తులకును సంఘములకును కొన్ని విపత్తులు గలుగవచ్చును. కొన్ని సహజమైన యాటంకము లుండవచ్చును. అంత మాత్రముచేత న్యాయపథము తప్పక సత్యవ్రతులగువారి యుద్యమము లెన్నటికిని కొనసాగకపోవు.

అమెరికా మొదలగు దేశములందు వర్తకవాణిజ్యము లెటుల నభివృద్ధిజెందినవో దెలియుట హిందువుల కవసరమని స్పష్టమగుచున్నది. అన్యదేశముల చరిత్రాంశములను తెలిసికొన్నచో జ్ఞానాభివృద్ధి కలుగును. ఏదేశమునకైనను విశేషకీర్తిసంపదలను సంపాదించినవి వర్తకవ్యాపారము లని మనకు రూఢిగ దెలియునప్పుడు, మన మావర్తకాభివృద్ధి యెటులగలిగినదో వారి కేమైన యాటంకములుగలిగెనో వానిని వారెటుల తప్పించుకొనిరో మొదలగు సంగతులను తెలిసికొన్నయెడల మనముకూడ వర్తకాభివృద్ధిని గాంచుట కవకాశము గలుగును. 1000 సంవత్సరములకు లోపుగ నాంగ్లేయులును, 500 సంవత్సరములకు లోపుగ నమెరికావారును, 100 సంవత్సరములకు లోపుగ జపానువారును నాగరికతను సంపాదించి నట్టును హిందువులన్నో కొన్ని వేలసంవత్సరములకు బూర్వమే నాగరికతను జెందిరనియు చరిత్రల వల్ల తెలియుచున్న సంగతులై యున్నవి.



నూరుసంవత్సరములకు బూర్వము మనదేశమునుంచి కోట్లకొలది రూప్యంబుల కిమ్మతుగల సరకులు విదేశములకు బోవుచుండెను. కాని ముఖ్యముగ పాశ్చాత్యుల యంత్రనిర్మాణశక్తివల్ల వారివస్తువులు చవుకగ మనదేశములో నమ్ముచుండుటచేత మన చేతిపనులు మూలబడి మన ఢక్కా శెల్లా లడుగంటినవి. మనసాలీలు కూలీలుగ చాలవరకు మారిరి. ఇప్పుడిప్పుడు బొంబాయి మొదలగుచోట్ల కొన్ని యంత్రములను స్థాపించి హిందువులు వర్తకాభివృద్ధికై పాటుబడుటకు బ్రయత్నించుచున్నారు. ఇట్టి తరుణమున నాంధ్ర మండలియందలి ప్రజ లెట్టివృత్తుల నెద్విధముగ మెలంగిన తమకును దేశమునకును మేలుజేయగలిగెదరో యాసంగతుల నమెరికా మొదలగు దేశ వర్తకచరిత్రలనుండి తెలిసికొనగలరు.

అమెరికావారు నూతనవ్యాపారములలో తమ ధనమును బలమును వినియోగించుట కెన్నడు వెనుకాడలేదు. అవసరమని వారికి దోచినప్పుడు వారి వృత్తులను సంరక్షించుకొనుచుండిరి. ఒక్కొక్కవృత్తియందు ప్రత్యేకించి పాండిత్యమును సంపాదించి యమెరికావారు కీర్తిని పొందియున్నారు. ఒక్కొక్కడుచేయు పనులకంటె నొకసంఘము చేరి చేయుపను లెక్కువ రమణీయముగ నుండుననుటకు అమెరికావారి వర్తకసంఘములే నిదర్శనములు. వారి సంఘములలో విద్యాధికులకంటె నేర్పరులైన పనివాండ్రే ప్రముఖులై యున్నారు. వర్తకులకు న్యాయవాదులకంటె లోకానుభవ మెక్కువైనను ద్రవ్యార్జనయే వారికి ముఖ్యోద్దేశ మగుటచేత నమెరికావారు

న్యాయవాదుల కెక్కువ గౌరవము నిచ్చుచున్నారు. ఈ రెండు తెగలవారే ధనార్జనకు ముఖ్యులై యున్నారు. "క్రప్పు"ను వర్తకుడు రాజ్యమునుసహితము తన వర్తకమునకంటె తక్కువగ నెంచినటుల వినుచున్నాము. వర్తకమువల్ల విశేషధనమార్జించుటకును విరివిగ దానధర్మములుచేయుటకు నవకాశము గలదు. కోట్లకొలది రూప్యముల ధర్మము నిచ్చినవారు వర్తకులే! కార్నిజీ, ఎడిసను మొదలగు కోటీశ్వరులు నిరుపేదలుగ నుండి తమ సామర్థ్యమువల్లనినుపవర్తకమునందును, విద్యుచ్ఛక్తియంత్రములందును లోకవిఖ్యాతిని గాంచినారు. అమెరికా యంత్రశాలలలో 14 మొదలు 20 సంవత్సరముల వయస్సునకు లోపలివారే పనులు నేర్చెదరు. ఆవయసును పాఠశాలలో వినియోగించుబాలురు వర్తకవ్యాపారముల బ్రసిద్ధిజెందుట యరుదు. అట్టి యంత్రశాలలలో పనిచేయువారు అణుమాత్రమైనను లాభనష్టములందు భాగమును సంపాదించుటకు బ్రయత్నించుచుందురు. యంత్రశాలలో పనిచేయు కూలికిని సరకులనమ్ము వర్తకునకును ధనమును పెట్టుబడిపెట్టు సాహుకారునకు నన్యోన్యసంబంధ ముండినయెడల నావ్యాపారమునకు లాభము నిశ్చయము. అనేకవృత్తులందు మనస్సును నిలుపక యొక్కవృత్తినే బాగుపరుచుట కమెరికావారు పట్టుదలతో పనిచేయుదురు.

ఓడలు బండ్లెక్కెడికాలమును బండ్లోడలనెక్కెడికాలమును జూచుచున్నాము. దేశకాల వ్యవస్థలచే బీదలు భాగ్యవంతులుగను భాగ్యవంతులు పేదవారుగను మారవచ్చును.



ఇదియంతయును సృష్టివైచిత్ర్యములలో చేరియున్నది. తెలివి చురుకుదనము శ్రద్ధ సత్యసంధత సత్ప్రవర్తన గల మనుజులేసంఘమునందుండినను ప్రముఖులు కాగలరని అమెరికా వారు దృఢముగ నమ్ముచున్నారు. అమెరికా కూలీలు దినమునకు 2 రూపాయిలకు తక్కువ సంపాదింపరు. వారికి ఫలవంతమైనట్టియు ననేక గనులను గలిగినట్టియు నరణ్యములతోనిండినట్టియు దేశముండుటచేత వారి యభివృద్ధికి కావలసిన ప్రథమలక్షణములను గలిగియుండిరి. ఏసంఘమైనను మరియొకసంఘమువారి వృత్తుల నాశ్రయించి జీవించుట దాస్యమనియు తయారుకాని తమసరకులను తమదేశమునందే తయారుచేసికొనుట ప్రతి యమెరికావానికిని విధికృత్యమనియు వారు తలంచుచుందురు. బాగుపడవలెనను ప్రతిసంఘమును తమ సరకులను తాము తయారుచేయుటకు ప్రయత్నించుటలో దప్పులేదు. అమెరికావారు తమపనులను ప్రోత్సాహపరుచుకొనుటలో నెక్కువ శ్రద్ధవహించిరి. కొద్దిసంఘములవారు చేయు ప్రయత్నములకు విఘ్నములు కలిగిన కలుగవచ్చును. అంతమాత్రముచేత వారారంభించిన వృత్తులను నిరసించియుండలేదు. తమసరకుల నితరదేశములకు బంపి లాభమును బొందుటకెప్పుడును ప్రయత్నించుచున్నారు.

ఇంటగెలిచి రచ్చగెలువుమన్న చందమున తమకు గావలసిన సరకులను తయారుజేసికొనలేనివారు పరదేశములకు సరకుల నంపి లాభమునుజెందు టెక్కడ? తమకు గావలసినవానికంటె నెక్కువసరకులు తయారుచేయువారు వాని నెవ్వ

ధముగనైన నితరదేశములకు బంపి చవుకగ నమ్మగలుగుదురు. ఒకవేళ తమకు నష్టమువచ్చినను సహించి తమసరకు లితరదేశములలో నమ్ముటకై ప్రతిసంఘమును స్వలాభమునిమిత్తమై దూరదృష్టితో సంచరించుచుండును. అమెరికావారు సాలుకు 40 కోట్లరూపాయల ఉక్కు నితరదేశములకు బంపుచున్నారు. 2 పౌనుల యినుమును వెయ్యిమైళ్ళదూరమునుండియు నొకటింబాతికపౌనుల బొగ్గును 50 మైళ్ళ దూరమునుండియు పౌనులో మూడవవంతు సున్నపురాతిని 140 మైళ్ళదూరమునుండి తెచ్చి యొకపౌను ఉక్కుగామార్చి దానిని 4 దమ్మిడీల కమ్ముట కమెరికావారి పెద్దయంత్రశాలలును వర్తకసంఘములును లక్షలకొలది పెట్టుబడియు కారణములై యున్నవి. శెనికానూనె యని బుడ్డి 6 రూపాయలమ్మిన కిరసనాయి లిప్పుడు బుడ్డి యర్ధణాకు గిట్టుట కదేకదా కారణము. వందలకొలది యడుగులు భూమిలోనికి త్రవ్వినను బొగ్గుగాని కిరసనాయిలుగాని చిక్కనప్పటికి పట్టుదలతో సాధించి 1320 అడుగుల లోతునుంచి బొగ్గుపొగను సంపాదించినవా రమెరికావారేగదా! ఇదివరకు 90 మంది నేర్పరులు పనిజేయుచుండిన యగ్నియంత్రమువద్ద 400 టన్నుల బొగ్గు ప్రతిదినము కాలుటకు మారుగ నొక్కనివల్లనా యంత్రము సున్నముగొట్టబడి బొగ్గుపొగవల్ల నడుపబడుటకంటె లాభకరమైనపని యేమికావలెను! తొల్దొల్త 47 అతుకులతో వేయబడిన రైలుపట్టాలకిప్పుడెట్టి ప్రశస్తమైన యుక్కుపట్టాల నమెరికావారు పంపుచున్నారో చూడుడు! దినమునకు '1700 గడియారములను త



యారుచేయు యంత్రశాల లెటుల సాధ్యమయ్యెనో కనుగొనుడు! సమర్థుడైనవానికి లాభము కలుగగలదనెడి దృఢవిశ్వాసమమెరికావారికి కలదు. భవిష్యత్కోటీశ్వరునియందు తేనెటీగ లక్షణము లుండితీరవలెను.

నమ్మకము హెచ్చినకొలది వర్తకమునందు లాభము హెచ్చును. మంచినడతగలవా డెక్కడనైనను ముందుకు రాగలడు. ఒక్కవ్యాపారమున వినియోగింపబడిన బుద్ధిబలము లాభమును గలిగించుటకు సందేహములేదు. బుద్ధిలేనివా రెన్నిసంఘములుగ జేరినను మంచినడతలేనివారి సంఘములవలెనే నష్టజాతకములనే గుణింపగలవు. వర్తకమునందు సంచరింప యత్నించు బుద్ధిమంతుడు కర్చులను తగ్గించుటకు దగిన యుపాయము నారయుచు నుండును. ఆత్మగౌరవముగలవారు కష్టపడి సంపాదించుకొనుటకు ప్రయత్నించెదరు. కాని ముందగ్రాసమున కాసించరు. ముందుకురాగలవాడెప్పుడు నాదాకు మించిన వ్యయముచేయక తనస్థితికి తగినటుల జీవనము చేయును. యంత్రశాలల యాజమాన్యము సామాన్యులకు లభింపదు. అనుభవముచేతను నడతచేతను తెలివిచేతను ప్రయోజకుడైనవా డాటంకముల నివారించుకొని ముందుకువచ్చును. వ్యవసాయవృత్తి దేశమునకు లాభకరమైనవృత్తియైనను విశేషలాభములను పొందుటకు వర్తకవ్యాపారములవంటి వృత్తులు లేవని యమెరికావారు తలంచుచున్నారు. వ్యవసాయము కాలక్రమమున ననేకమందికి వ్యాపించుచుండ వ్యాపారము కొద్దిమంది చేతులలోనిలుచును. ఏ నూతన యంత్రనిర్మా

ణమువల్ల దేశమునం దెట్టిమార్పులు గలుగునో యనెడి సంగతి నెఱింగి యెంతహీనస్థితియం దున్నట్లు కనబడెడు దేశము సహితము తనయొక్క భావిదశనుగురించి నిరాశ జెందవలసినపని గన్పించదు.

దేశము భాగ్యవంతమైనందు కచ్చటి నాణెములే గుర్తు. బంగారునాణెములు వాడబడుదేశములు భాగ్యవంతములైనవి. అమెరికాలో బంగారము వాడుచున్నారు. పేదవారెప్పుడును ముతుకదుస్తులను ధరించుటచేత సాధారణముగ నితరదేశములనుండివచ్చెడు సరకులను భాగ్యవంతులే విశేషముగా గొనెదరు. ఏవస్తువకైనను కర్చు హెచ్చైనచో దానిని తయారుజేయుటకు నుత్సాహము కలుగును. క్రమక్రమముగ నావస్తువుకు ఖరీదు తగ్గగలదు. కొనువారి సంఖ్యనుబట్టి తయారుచేయువారిసంఖ్య యుండును. ఉక్కువ్యాపారమున ప్రసిద్ధిగాంచిన కార్నీజీ "బాల్యమునందున్న మనుజులేమి సంఘములేమి వృత్తులేమి రక్షింపబడవలె" నని యభిప్రాయపడుచున్నారు. అట్టిరక్షణ ప్రభుత్వమువారే కొన్నిచోట్ల దయచేయుచున్నారు. కొన్నిచోట్ల నట్టి రక్షణ కాటంకములు గలుగుచున్నవి. పెద్దవారితో సమముగ పసిపిల్ల లెండవానలకు నోర్చుకొనగలుగుదురా? వారిలో నొకరు స్వతంత్రమును స్వేచ్ఛనుగోరి యాప్రకారము సంచరింపవచ్చును. బాలుర నట్లువదలిన వారి గతి యేమగునో చూచుచున్నాముగదా! తన వ్యాపారమును కాపాడి యభివృద్ధికిదెచ్చి కోటీశ్వరుడైన కార్నీజీ, తన జీవితమును సార్థకముచేయవలెనన్న మనుజుడు ధనమార్జించి



తగిన ధర్మములనుచేయుచు బీదవారికి విద్యయొక్కలాభమును కలుగజేయుటకై ప్రతియూరను పుస్తకభాండాగారము లుంచవలెననియు తనజన్మయొక్కలాభము నితరులకు గలిగింపవలెనన్న తనదేశమువారి కెద్దియైన మేలునుజేసి వారిని సంతోషపెట్టుటకు ప్రయత్నించవలెననియు హితోపదేశము జేయుచు తానటుల కొన్ని కోట్లరూపాయలను పుస్తకభాండాగారములకై కర్చుపెట్టియున్నాడు. సోమరుల కాయన సహాయము జేయనని దీక్షవహించినవాడు.

పైసంగతులవల్ల నమెరికావారికిగల సుగుణరాశి మనకు దెలియుచున్నది. ఏదేశమునైననుజూచి యచ్చటి మంచిని సంపాదించుటకు బ్రయత్నించుటమనకువిధియైయున్నది. మంచియలవాటులు లభించుటకు గొంతకాలముబట్టును గనుక త్వరపడి మన పట్టుదలను వదలక నమెరికా వారివలె వర్తకవాణిజ్యములందు ఖ్యాతిగాంచుటకు ముందుగా వారిదేశ చరిత్రను తెలిసికొనుట యవసరమైయున్నది.

కాబట్టి యీ చిన్నపుస్తకమునందు ముఖ్యముగ నమెరికావారి ప్రాముఖ్యతకు గల సంగతులను మన యాంధ్రసంఘమునకు దెలియగలందులకు వ్రాసియున్నాను. దీనివలని లాభము నాంధ్రులలో బెక్కండ్రు పొందగలగని నమ్ముచున్నాను.

---



# అమెరికా వర్తక చరిత్ర.

## 1. వర్తకాభివృద్ధికి మార్గములు.

చేతిపనులవల్లగాని యంత్రసహాయమువల్లగాని సరకులను తయారుచేసి వానిని వర్తకమున వినియోగించుటకయి యన్నిదేశములవారును ప్రయత్నించుచుందురు. ఏవ్యాపారమునందయినను గెలుపుచెందుటకు కొన్ని మార్గములుగలవు. అమెరికాదేశమున విశేషధనికులయిన కార్నెజీ, తాంక్యాగోర్, పిప్కైర్క్ మొదలగు మహాసియులు మొట్టమొదట చీపురు చేతబట్టి యూడ్చి కచ్చేరిగదులను పరిశుభ్రముగనుంచుట కలవాటుపడిరన్న మనవారు విస్మయమందగలరు. కాని అభివృద్ధికి ముఖ్యమార్గము దురభిమానము నశించుటయని తెలిసికొనవలెను. అమెరికనులు తమయభివృద్ధికై నడచినమార్గములను మనము పరిశీలించుట యవసరము. వారెప్పుడును యెక్కువస్థితి సంపాదించుటకే చూచుచుండెడివారు. ప్రతివ్యాపారమునందును లోకమునకు తమయందెక్కువ నమ్మకము కలుగునటుల మోసమును పీసమయినను చేరనియ్యక "సత్యంవద ధర్మంచర"యను నార్యోక్తుల ననుసరించి నడచు

చుందురు. శీతలప్రదేశమని పనివాండ్రు సాధారణముగా నలవాటుపడు మద్యపానమును అక్కరకు రాగలవారొక్కరయిన నలవాటు చెందరు. తమ మంచిపేరును ద్రవ్యమును నష్టపరచుటకు సాధకమగు జువ్వా వ్యాపారములలో ప్రవేశించుటకట్టివారు సమకట్టరు. జువ్వావ్యాపారములను చేయువారు శీఘ్రముగ దివాలాపదవి నందుదురు. ఇదిగాక అట్టి జువ్వాకోరు లితరుల శ్రేయస్సును లాభమును గమనించరు. నిలుకడమీదగాని వ్యాపారముచేయువానికి పేరు ప్రతిష్టలు రాజాలవు. అనేక సంవత్సరముల వరకు నోర్పుకలిగి యెడతెగకుండ పనిచేయుచుండవలెను. జువ్వాకోరుల నెవ్వరు నమ్మరు. వారికి సరుకులివ్వరు. మంచినడతగలిగి జాగ్రత్తతో పనిచేయువానియందు నమ్మకము కుదురును. వానికి సరుకులిచ్చువారెందరో యుందురు.

కొందరు తమవ్యాపారము లందలి తెలివితేట లెటులున్నను మొగమోటమిచే నష్టపడుచుందురు. వ్యాపారమునందెవ్వరేని మరియొకరికి జామీనుండు వారు వెంటనే యపాయమునకు సంసిద్ధులని నమ్మవలెను. స్నేహితుడని తలచి యెవ్వరికయిన నుపకారముచేయదలచి హామీయుండ దలచిన పక్షమున తన స్థితిగతులను ముందుగా తెలిసికొని తానుచేయు పని ధర్మకార్యమని తలంచవలెను. త్రికరణశుద్ధిగ పనులను నెరవేర్చువారే వ్యాపారముల ముందంజవేయగలిగి యభివృద్ధికి రాగలరు. ప్రతిమనుజుడును తనయజమానియొక్క మెప్పును వడయుట కెద్దియో బుద్ధివిశేషమును నదృష్టచిహ్నమును



కనపరుచుచుండును. అట్టివాడెప్పుడును తన యజమాని పనియందే లక్ష్యముంచి లాభమును కనబరచును. యజమాని యుత్తరవుల ప్రకారము నడచుచు అవసరమయినచో యజమానికే నష్టమువచ్చునని తోచినప్పుడు యుత్తరవులని మొండిపట్లుబట్టక తద్విరుద్ధముగ సంచరించి యజమాని వ్యాపారమును రక్షించుట కర్తవ్యము.

అమెరికాదేశపు పనివాండ్రెప్పుడును తమ ఆదాయమునకు మించిన ఖర్చుచేయక తమకువచ్చు దానిలోనే కొంచెము మిగులునటుల జేసి దానినిలాభకరమగు వ్యాపారములందు మూలధనముగ నుంచుచుందురు. అట్టి మెలకువగల పనివాండ్ర యెడల యజమానులు దయగలిగియుండి వారియందెక్కువనమ్మకము నుంచెదరు. పెక్కువ్యాపారములలో మూలధనముకంటె నాదాచేయుటయందు నిపుణులును పనితనమునందు నేర్పరులున్నైన వారిసహాయమే యెక్కువావశ్యకము. ఆపనివాండ్రే మూలధనమును కలిగించగలరు. భవిష్యత్కోటీశ్వరునియందు తేనెటీగ లక్షణములుండి తీరవలెను. తనకు ముందుకు రాగలుగుట కవకాశము చిక్కలేదను వారిలోకావలసిన లక్షణములయిన శౌర్యములయియుండవలెను. లేనియెడ వారసమర్థులయియుండవలెను. బుద్ధిబలమున కెప్పుడును గిరాకియుండును. ఒకప్పుడు కొన్నివ్యాపారములలో మంచి పనివాండ్రుండియు కొంతకాలము తగ్గుస్థితిలో నుండినను కాలక్రమమున జాగ్రత్తతో నిర్వర్తించబడినచో లాభము తప్పక రాగలదు. ఎవరు తమయోపికను యోచనను ధనమును

తాము సంచరించు వ్యాపారమునందే స్థిరముగ నుంచెదరో అట్టివారికి జయము కలుగుట కేమియు సందియము లేదు. అందుకు దృష్టాంతముగా "బుట్టకొక కోడిగ్రుడ్డునుంచి యనేకబుట్టలను కాపాడుటకంటె నున్న కోడిగ్రుడ్ల నన్నిటిని నొక్కటే బుట్టలో నుంచి దానినే భద్రముగ కాపాడుట శ్రేష్టతరము" కాదాయని కార్నీజీగారు వ్రాయుచున్నారు. అమెరికావారి వ్యాపారదిగ్విజయమునకు వారి నిదానమే ముఖ్యకారణము.

అమెరికాలో ప్రతిమనుజుడును స్వాతంత్రజీవనము నపేక్షించుచుండును. ఆత్మగౌరవము గలవారెవ్వరును తను భూతాది కర్చులకు నితరులపై నాశ్రయించియుండరుగదా. ఆత్మగౌరవము లేనివారికి నిజమయిన సౌఖ్యము కలుగుట కష్టము. ఆదా చేయువాడే సహజముగ నిదానము గలవాడై దారాపుత్రాదులయెడ నుచితరీతి వర్తించుచు చట్టమునకు బద్ధుడై నెమ్మదిగ కాలము గడుపుచుండును. కోట్లకొలది గణించి పూడ్చియుంచువారు వ్యాపారములందు నిపుణులని చెప్పుటకు వీలులేదు. ఆదా చేయుటకును కొంతపరిమితి గలదు. తన కుటుంబమునకు సౌఖ్యముగా జరుగుటకుచాలినంతకంటె హెచ్చుగచేర్చువాడు తనవిధి నతిక్రమించువాడగుచున్నాడు. అధికముగనట్లు చేర్చబడిన ద్రవ్యమున కతడు ధర్మకర్తవంటివాడగుచున్నాడు. నూతన వ్యాపారములందలి చొరవయు యుక్తాయుక్తజ్ఞానము మేధాశక్తివిశేషముచే పనులను పొందుబాటు చేయుటయు ఐకమత్యమును ధనార్జనకు ముఖ్యసాధనములు. ప్రపంచములో ధనమార్జించినందుకు సార్థక



మెప్పుడును ప్రజానుకూలమగు ధర్మకార్యములందు నధిక ధనమును వినియోగపరచి ప్రజానురంజకముగనుండుట యనియునట్టి మహాదుద్దేశముతో సంచరించుటకు అమెరికాదేశపు పనివాండ్రెప్పుడును ప్రయత్నించుచున్నారన్న హిందువుల ధర్మములు తలంపునకు రాగలవు.

ఎక్కువ యభివృద్ధిజెందవలెనన్న శాస్త్రశోధనతోగూడిన పరిశ్రామిక విద్య యవసరము. నిరంతరము యంత్రశాలలో పనిచేయు బుద్ధిమంతులకు నభివృద్ధికిగల యాలోచనలు స్ఫురించుటకవకాశముగలదు. భూగోళశాస్త్రపరిచయమును ఇతరదేశములందలి వృత్తులవివరమును అచ్చటిధరలుమొదలగునవి సకాలములో గనుగొనుటయు వర్తక వ్యాపారముల యభివృద్ధికి గావలసియున్నవి. అన్నిటికిదోడుగ మంచినడతయు పనివాండ్రయందు దయయు గలవానికి నదృష్టము వానిని వెంటనంటియే యుండునని యమెరికావర్తకులు నమ్ముచున్నారు.



# 2. ఐకమత్యము.

---

వ్యాపారమనగా ఈశతాబ్ద నిఘంటువునందు సాధారణభాషలో వర్తకముతో పర్యాయపదముగా వ్యవహరింపబడుచు నట్టి పనులయందు లెక్కలతోను సొమ్ముతోను సంబంధము కలిగి వానియందు బుద్ధిశ్రద్ధల నుపయోగపరచు వారినే వ్యాపారముచేయువారని పరిగణించుచున్నారు. సాహుకారనిగాని వర్తకుడనిగాని భిన్ననామముల వ్యాపారము చేయువారిని పిలుచుచుందురు. వ్యాపారమునందు భాగస్థులుగ నుండి లాభమును పంచుకొనుటకు హక్కుగలవారే వ్యాపారముచేయు వర్తకులగుదురు. కాని గుమాస్తాలు నౌకరులు అట్టివర్తకులుగారు. వర్తకుడైనవాడొకవేళ నష్టమువచ్చినను భరించుటకు సిద్ధముగానుండును. అందువల్ల తన వ్యాపారమునందెక్కువ శ్రద్ధపుచ్చుకొనును. ఎవరయినను ఒక్కవ్యాపారమునందే తమశక్తిని ధారపోయగలరుగాని భిన్నవ్యాపారములందు మెలంగుటవల్ల నెక్కువలాభము గలుగదు. అమెరికనులు ప్రతిపనియందలి యంతర్భాగములను విడదీసి ఒక్కొక భాగమునకు ప్రత్యేకించిన మనుష్యుల నేర్పాటుచేయుచుందురు. గొప్పవ్యాపారములను చేయువారే దేశమునకు సంఘమునకు మేలొనరించువారగుచున్నారు. వారిపనులలో తమకుగల బుద్ధిబలమును ఉపయోగించి ధైర్యసాహసములను వెల్లడింప వారికెక్కువ అవకాశముగలదు.



నౌకరుగాగాని గుమాస్తాగాగాని జీతము పుచ్చుకొనుచు పనులలో ప్రారంభమున ప్రవేశింపవచ్చునుగాని అంతటితో తృప్తిపొందిమాత్ర మమెరికను లూరకొనక భాగస్థులుగ జేరుట కెప్పుడును ప్రయత్నించుచుందురు. వ్యాపారలక్షణములు తెలియని మూఢుల సంఘములలోగాక మంచివర్తక సంఘములలో చేరిన బుద్ధిమంతుడై మంచి నడతగలిగిన శ్రద్ధాళువునకు త్వరలో గొప్పపదవి చేకూరుటకు సందియములేదు. ఒక సంఘమునకుగల మూలధనమునకు దానికుండు సొత్తునకు వ్యత్యాసముండును. నమ్మకముతోను శ్రద్ధతోను ఒక్కటే పనియందు సంచరించువారికి లాభము నిశ్చయముగ రాగలదు. సమర్థులయిన నమ్మకముగల భాగస్థులు మూలధనముకంటె హెచ్చుగా నెంచబడుచున్నారు. విద్యాధికులమని పెద్దపరీక్షల నిచ్చినవారు వర్తక వ్యాపారములందు వన్నెకెక్కుట సాధారణముగా లేదు. వ్యాపారమునకు కావలసిన శిక్షగాని ఆసక్తిగాని విద్యాధికునకు లేవు. భాగ్యవంతుల కొడుకులకును వ్యాపారములందభిరుచి తక్కువ. బహుశః ప్రజలయొక్క క్షేమముకొరకే సృష్టియందు భిన్నరుచులేర్పడుచున్నవి.

వర్తకులకు లోకజ్ఞానము ముఖ్యావసరము. ఒకదేశములోని యుద్ధము, కలరా, గాలివాన మొదలగు స్థితులను దెలిసికొనుట వారికికావలెను. న్యాయవాదికంటె వర్తకునకెక్కువ యభివృద్ధి కవకాశముగలదు. న్యాయవాదెంతవరకును 'గతానుగతికో లోకో'యనియు చట్టమనియు నియమితచర్యకు లోబడియుండ, వర్తకులకు నూతన యంత్రములను

నూతన సంఘములను నూతన విధంబుల నెలకొల్పుటకు బుద్ధివికాసమున కవకాశముగలదు. కానివర్తకుడెంతవరకును కేవలధనాపేక్షనే జెందియుండ న్యాయవాదియొక్క వృత్తి మిక్కిలి గౌరవనీయమైనది. దేశమునందలి వృత్తులను ప్రోత్సాహపరచి అనేకమంది బీదలకు పనులను గల్పించుటకు వ్యాపారము జేయువారే సమర్థులగుచున్నారు. అమెరికాలోని పార్లమెంటులోని సభికులు పెక్కండ్రు వర్తకవ్యాపార సంఘములలో ప్రముఖులయియున్నారు. 'క్రప్పు' అను కోటీశ్వరునకు జర్మనీదేశపు చక్రవర్తి యువరాజ్యము నివ్వబోగా "ఉక్కు రాజు" అని పిలిపించుకొనుటకే యిష్టపడెనుగాని రాజ్యమునకు యువరాజుగానుండుట కంగీకరించలేదని తెలియుచున్నది. అమెరికాదేశములోగల కొన్ని యంత్రశాలలలో నొక చిన్న రాజ్యములోకంటె నెక్కువజనులుగలరు.

సాధారణముగా నొకవ్యాపారమునందు సంచరించువారిరువురున్న యెడల వారికి సఖ్యత కుదురుట కష్టము. కాని అమెరికాలోనట్టి భేదభావమునకు మారుగ ననుదినము మారుచున్న యంత్రములు నూతనపద్ధతులు శాస్త్రశోధనలు వర్తకులలో నైకమత్యమును హెచ్చింపుచున్నవి. అన్యోన్యసహాయమవసరమగుచున్నది. ప్రతిదేశములోగల ప్రసిద్ధిజెందిన గొప్పవారందరును దేశమునందలి వృత్తుల నభివృద్ధికి దెచ్చుటయందే ముఖ్యోద్దేశ్యము కలిగియుందురు. సృష్టియందొక్కొక్కరికిగల బుద్ధివిశేషముచేత నొక్కొకవృత్తియందు ప్రఖ్యాతి



వహించుట కవకాశముగలదు. అన్ని జాతులవారును యేదో వ్యాపారమున ప్రసిద్ధిజెందుటకు ప్రయత్నించుచున్నారు.

ఫ్రాన్సుదేశపు మృదువస్త్రములును బ్రిటనుదేశపు నూలుయంత్రములును అమెరికావారి విద్యుచ్ఛక్తి యంత్రములును జర్మనీవారి వింతరంగులును ప్రపంచములో నగ్రగణ్యములైయున్నవి. ఈదినము వ్యాపారములందతిహీనముగ చూడబడుచున్న దేశము రేపొక నూతనయంత్రమహిమవల్లనో విద్యుచ్ఛక్తి ప్రభవల్లనో వనమూలికల సహాయమువల్లనో జగద్విఖ్యాతిగాంచవచ్చును. సారాయమునుండి చక్కెరను దీయు పద్ధతివల్ల చెరుకు వ్యాపారమునకును హారతికర్పూరము చెట్టునుండిగాక శాస్త్రప్రకారము తయారుచేయుటవల్ల కర్పూరవ్యాపారమునకును, నీలిమందు నదేవిధముగ జేయుటవల్ల నీలి వ్యాపారమునకును గలిగినమార్పు లెల్లవారికిని తెలిసియున్నవి. 'మెసాబా' ఇనుపగనులవల్ల అమెరికాకును రసాయనశాస్త్రశోధనలవల్ల జర్మనీకిని ప్రాముఖ్యతవచ్చెను. అమెరికాలోవలె ప్రవాహవేగమువల్ల విద్యుచ్ఛక్తిని చేర్చుట అనేకచిత్రములకు కారణముకాగలదు. కాబట్టి పైకారణములవల్ల నేదేశమయినను తనప్రస్తుతపు స్థితినిగురించి నిరాశ చెందగట్టదు.

---

# 3. పనివాండ్రు.

అమెరికావారు తెలివిగల పనివాండ్రను ధనముకంటె హెచ్చుగ చూచుచున్నారు. పనివాండ్లసంఘములున్నచోట్ల పుస్తకభాండాగారముల నేర్పరిచి కార్నీజీగారు వారికి మహోపకారులయియున్నారు. పెద్ద సంఘములవారు సరకులను తయారుచేసి చవుకగ నమ్ముటకు ప్రయత్నించుట ఆర్థికశాస్త్రము ననుసరించిన పనియైయున్నది. మామూలుగనుండు తప్పనిసరి కర్చులను తగ్గించుటకు ప్రయత్నించు యంత్రశాలయొక్క మూలధనమునకు నిలకడ గలుగుచున్నది. అన్యోన్యసహాయనిధులును పుస్తకభాండాగారములునుసామాన్యజనులకవసరమైయున్నవి. యజమాని దయగలవాడై పనివాండ్రయెడ నమ్మకముతో సంచరించుచు వారియొక్కక్షేమమునకు తగిన సదుపాయములను జేయుచుండవలెను. పనివాండ్రును యజమానియెడ భక్తివిశ్వాసములతో నమ్మకముగ సంచరింపవలెను. యజమాని చేయగల సహాయమెట్టులుండినను పనివాండ్రు తమలోతాము పరస్పర సహాయమునకై శ్రద్ధవహించవలెను. ఒకదేశముయొక్కగాని సంఘముయొక్కగాని ఐశ్వర్యము పనివాండ్ర స్థితిగతులనుబట్టియుండును. యజమానికి లాభముతక్కువై ధరలు మందమయినను పనివాండ్రు తమ కూలిని తగ్గించుటకియ్యకొనరు. యజమానితన కెక్కువలాభము



వచ్చినప్పుడు పనివాండ్రకు కూలిని హెచ్చుచేయుటకుమారుగా తగ్గించగలుగుట కవకాశమేర్పడుచున్నది. నష్టమువచ్చుచున్నదని యజమానికూలిని దగ్గించుటకు ప్రయత్నించెనేని పనివాండ్రు సమ్మెకట్టి పనులకాటంకము గలిగించుట కవకాశమేర్పడుచున్నది.

యజమానికిగల కష్టసుఖము లేరీతిగనుండినను పనివాండ్రకియ్యబడు రేటులు స్థిరపడియుండుటమంచిది. ఒకప్పుడు యజమానికి చాలానష్టము వచ్చుచున్నను కొనువారురాకపోవుదురను భయముతో ధరలను హెచ్చింపవీలులేక నిజస్థితిని బహిరంగముగ తెలియనివ్వకుండును. లోపాయకారీగానట్టివారుచేయు హీనక్రయములకు మితియుండదు. మూలధనమెంత హెచ్చినను పనివాండ్రకియ్యవలసిన కూలిని తగ్గింపజాలదుకాని పనివాండ్రు మూలధనమును హెచ్చుచేయ గలుగుదురు; తగ్గించగలుగుదురు. పనివాండ్రకూలిని తగ్గించుటకు ప్రయత్నించు యజమాని వ్యాపారమునకు నష్టజాతకమును గుణించుచున్నట్లెంచవలెను. అనవసరమయిన భాషాసాహిత్యముగాక పనివాండ్రకు కావలసిన ప్రకృతిశాస్త్రవిద్యను అనుభవవిద్యను యజమానులిచ్చుటకు ప్రయత్నింపవలెను. అమెరికాలోనాప్రకారము చేయుచున్నారు. పనివాండ్రెప్పుడును తమకెక్కువ యభిరుచి కలిగినట్టియు తమజీవనోపాధికి ముఖ్యసాధనమైనట్టియు పనులలో మెలగుటకు ప్రయత్నముచేయవలెను. కాబట్టి సరకులను తగినంత సప్లయుచేయుటకును పోటీవచ్చినయెడ నోర్చుకొనుటకును నష్టము లెట్టులున్నను

పనివాండ్రకిచ్చు రేటులను మార్చకుండుటకును అమెరికావారు శ్రద్ధతో బూనియున్నందున వారి యైశ్వర్యమును హెచ్చుచుండుటకు కారణమగుచున్నది.

వ్యాపారములలో గ్రంథస్థవిద్యకంటె లోకానుభవమువలనగలుగు విద్య హెచ్చుగ నెంచబచుచున్నది. యజమానికిని పనివాండ్రకు నన్యోన్యమేర్పడిన యెడల పనులు సౌకర్యముగ నిర్వర్తింపబడగలవు. ధనికుడు పనివాండ్రయొక్క యిబ్బందులను తెలిసికొనుట కష్టము. పనివాండ్రకు ధనికునియొక్క చింతలను గుర్తెఱుంగుట కష్టము. ఉభయుల కష్టసుఖములనుభయులు దెలుసుకొన్నచో దేశైశ్వర్యము హెచ్చును. కాయకష్టము, బుద్ధిబలము, ధనము నైశ్వర్యమునకు ముఖ్యమైయున్నవి. అమెరికాదేశపు ప్రెసిడెంటుగానుండిన గార్ఫీల్డుఅను మహనీయుడు పేదరికముకంటె నైశ్వర్యమునకు వారసత్వపు హక్కున హెచ్చగునదింకొక్కటిలేదని నుడివియున్నారు. పుట్టుకతో ధనసంపన్నులగువారికి సుగుణసంపత్తియందేమి బుద్ధిబలమునందేమి మాంద్యము ప్రవేశించుట సహజమైయున్నది. ఏతండ్రియైనను తనకొమారునికి తగని పదవినిచ్చి యందువల్ల నడతవమానకరమగు విధమున సంచరించెనేని అట్టి తండ్రి మనయోదార్పునకు నర్హుడుకాజాలడు. తండ్రి కుమారునికిమంచి విద్యను దేహబలము నిచ్చిన ధన్యుడగును. సోమరులెన్నడును మన్ననకు పాత్రులుగారు. వారు లక్షాధికారులయినను కష్టపడిపనిచేయువారికి గల సౌఖ్యము వారికెన్నటికిరాజాలదు.



ప్రపంచములో పేదరికమను మాట లేనిచో నభివృద్ధియు శూన్యమనియే తలంచవలెను. ఆడంబరముగాని వైభవముగాని తగనివి. ప్రతిమనుజుడును స్వశక్తిని పోషింపబడుటకు ప్రయత్నించవలెను. ఆయుర్భాగ్యమును ప్రమాదములును రోగములును క్షామకారణములును మనుజుని జీవితమును బాధించుచుండును. ప్రతిమనుజుడు ఖర్చునుతగ్గించి యాదాచేయుటకు ప్రయత్నించును. యంత్రములకు కట్టెలనుపయోగించుటకు మారుగ బొగ్గు నుపయోగించుటవల్ల కర్చును సగము చేయగలుగుట కవకాశము కలిగినది. ఇంక నివ్విధంబున ననేక మార్గములను కనుగొని కర్చులను తగ్గించుటవల్లను ప్రతిమనుజుడును తన ఆదా నేదోయొక్క వ్యాపారసంఘమున నిలువయుంచుటకు ప్రయత్నించుటవల్లను నెలకు పదిరూపాయలవల్ల జీవనముచేయు కుటుంబముల నైదురూపాయలతో కాలము గడుపునటులచేయవచ్చును. కాలచక్రము తిరుగుటలో ధనికులు బిదలగుటయు బీదలు భాగ్యవంతులగుటయు ధనము నీటివలె నొక్కచో నిలుకడగాంచక సంచలనశక్తి గలిగి నొక చోటనుండి మరియొకచోటునకు ప్రవహించుటకు ప్రయత్నించుచుండుటయు మనము చూచుచున్నాము. విశేష బుద్ధిమంతులును, ధనికులును, నూతనయంత్రములను కనుగొనువారును, విశేషము ఆదాయముచేయువారును, ప్రజానుకూలమగు కార్యములందు తమ ధనమును సద్వినియోగముచేయువారును, ప్రజానాయకులని నమ్మవలెను. అమెరికావారి యైశ్వర్యము ప్రస్తుతమట్టిమహనీయులవల్లనే స్థిరమై యభివృద్ధిజెందుచున్నది.

# 4. విద్య.

వృత్తుల యందును వ్యవసాయము నందును కష్టము పడువారు ధనికులుకాగలరు. భూమి క్రమముగ పెక్కండ్ర చేతులలోను వృత్తులు తక్కువమంది చేతులలోను నిలుచుట సులభమగుచుండును. అమెరికాలో 1850 సంవత్సరములో 203 యకరములభూమి చొప్పున గల కుటుంబమునకు 1860 సంవత్సరమునాటికి 199 యకరములును, 1870 సంవత్సరము నాటికి 153 యకరములును, 1880 సంవత్సరమునాటికి 131 యకరములును సకటున భూవసతి యేర్పడియున్నది. ఏసంఘ మయినను అభివృద్ధికి రావలెనన్న ఆసంఘమునందలి జనులు తమ స్వాధీనములోనున్న భూములను తామే స్వయముగ బల పరచి బాగుచేయుట ముఖ్యమై యున్నది. భూమియందలి హక్కుగలవారు వేరుగనున్నప్పుడు భూమి నెక్కువ బలపర చుటకు రహితు ప్రయత్నముచేయుట కవకాశము లేదు. వ్యాపారములు కొద్దిమంది చేతులలోనుండి విరివిగ చేయబడి నచో సరకులు చవుకగ గిట్టగలవు. అమెరికాలో దినమునకు 1700 గడియారములు తయారుచేయగల వ్యాపార సంఘ ములుగలవు. అట్టి గడియారము లెంత చవుకగ గిట్టుచున్నవి మనకు తెలిసిన విషయమే. ఒక్కొక్క యంత్రశాలలో నెన్ని వేల గజముల నూలు వస్త్రములు ప్రతిదినము తయారు కాబడుటలేదు ! దినమునకు నొక్క యంత్రశాలలో 12,000 పుట్ల ఉక్కు తయారుకాబడి మణుగు అర్థరూపాయి ధర గిట్టు చున్నది. చిల్లరగ చేయబడిన యెడల ఖర్చులు 3 రెట్లు కాగలవు. బాహుళ్యముమీాద పెద్ద యంత్రశాలలో ఖర్చులు తగ్గును. ఇదిగాక పెద్దయంత్రశాలలో మూలధనము హెచ్చు గానుండుటచేత ఖర్చులు తగ్గించుట కవకాశము గలుగు చున్నది.

వర్తక వ్యాపారములలో జయమునుగాంచుట కష్ట మయినను తుద కెక్కువ లాభమును పొందవచ్చునని నిశ్చ యముగా జెప్పవచ్చును. గ్రామోఫోను కనిపెట్టిన ఎడిసను మొదట టెలిగ్రాఫు తీగలను బాగుచేయుచుండిన కొద్ది నౌక రేయైయున్నాడు. సుప్రసిద్ధులయిన పనివాండ్రు లెందరో కడు బీదవాండ్రుగనుండి వర్తకవ్యాపారములవల్లనే వాసిగాంచిరి. వర్తక వాణిజ్య వ్యవహారములలో పనిచేయు గుమాస్తాలును బీదవారయి యుండుటచేత వారికి పనులయందాసక్తి హెచ్చు గనుండి అభివృద్ధికి తగిన ప్రోత్సాహము సహజబీదరికమునందు కలిగియున్నారు. ఏయంత్రశాలాధికారిగాని వర్తకసంఘాధి కారిగాని విద్యాధికుడై కళాశాల పరీక్షనిచ్చినవాడై యున్నా డేమో చూడుడీ! బాల్యమున 14 మొదలు 20 సంవత్సరముల వయస్సులోపల నున్నవారు పనులలో నిపుణతను గనపరచు చుండ విద్యార్థులు వ్యర్థమయిన పుస్తక కాలక్షేపముచేత జీవయాత్ర సలుపుచుందురు. పనివాండ్రును భవన కర్మాగార ములవిద్య నభ్యసించి తమ భావి యభివృద్ధికి సహాయ్యులగు

చుండ విద్యాధికులు నేర్పుతోకూడిన వృత్తులకు దక్క అన్యకార్యములకనుకూలింపని పనులయందు కాలమునుగడుపుచుందురు. వైద్యుడు,న్యాయవాది,మతాచార్యుడు త్రివృత్తుల ప్రవేశించువారు. వీరి వృత్తులే నేర్పుతోగూడిన వనబడుచున్నవి. నవీన ప్రకృతిశాస్త్రశోధనతో గూడిన విద్యాభ్యాసముగల పనివాండ్రెప్పుడును కేవల మనుభవ ప్రాధాన్యముగల పనివాండ్రకంటె నధికులగుచున్నారు. శాస్త్రశోధనచేయువారు నిష్పక్షపాత బుద్ధితో శాస్త్ర రహస్యములను తెలిసికొని నూతన యంత్రకల్పనలకు కారణభూతులగుచున్నారు. కేవలము గుమాస్తాలుగాను కూలీలుగాను ఉండువారియొక్క శ్రమవల్లనే యనేకపనులు నెరవేరుచున్నను వారికి మూలధనముగాని, విద్యగాని సిఫార్సుగాని, విశేషము లేనివారై జీతముల నాశ్రయించుకొని వర్తకాభివృద్ధికి పునాదులగుచున్నారు. వ్యాపారవిద్యకును వ్యవహారవిద్యకును వ్యత్యాసము గలదు. ఎంత మూలధన ముండినను ఎంత సిఫార్సుండినను ఎంత విద్యాధిక్యతయుండినను అవి పేదరికమువంటివి కాజాలవు. దానివల్లగలుగు శక్తిసామర్థ్యములవల్ల సాధింపదగని దెద్దియును విశ్వమునలేదు. నిజమైన శక్తిగలవారందరును ప్రసిద్ధిగాంచి యుండిరి. కేవలము జీతములను పుచ్చుకొను నౌకర్ల సహాయమువల్లనే పనులను నిర్వర్తింపదలచు యజమానికి నష్టము సంభవించిన వింతలేదు. మూలధనము నొక యంత్రశాలకిచ్చి వేరొకచోటనుండు ధనికులకన్న, తమ స్వల్పలాభమునే యంత్రశాలలోనుంచుకొని పనులుచేయు పనివాండ్రు



శ్రద్ధతో పనులు నెరవేర్చగలిగి ఎక్కువప్రయోజనకారులగుచున్నారు. ప్రతివ్యాపార సంఘమునందలి పనివాండ్రును తమ ఆదాను మూలధనముగచేయుట ముఖ్యము. యజమాని లాభము తనలాభమని నమ్ము పనివాండ్రే ముందుకురాగలరు. అట్టి నౌకర్లేమి కూలీలేమి గుమాస్తాలేమి జీతము హెచ్చుచేయమని యజమానిని తొందరపెట్టుటకంటె లాభములో కొద్దిభాగము నిప్పించమని కోరుటమంచిది. ఒకప్పుడు సరకులకు గిరాకి తగ్గి లాభము మందమయినను వెంటనే మంచి కాలము రాగలదు. వ్యాపారములలో ధనమునుకాపాడి సప్లయిచేయువారు బ్యాంకివారనియు, సరకులను తయారుచేయువారు యంత్రశాలవారనియు, సరకుల నమ్మువారు వర్తకులనియు వ్యవహరింపబడుచున్నారు. ఎవ్వడేని తన ధనమును శక్తిని బుద్ధిబలమును నమ్మకము నొక్కవ్యాపార సంఘమునందే వినియోగించునో వాడు బాగుపడగలడు. త్రాగుబోతులయి జువ్వాకోరు వ్యాపారములదిగి యితరులకు జామీనులుందురో వారు తప్పక పాడుగాగలరు. వ్యాపారములలో నపజయము పొందువారికి ఐకమత్యభావమో, మూలధనమో, నమ్మకమో, బుద్ధిబలమో శూన్యమైయుండి తీరవలెను.

---

# 5. ఆదాయ వ్యయములు.

---

అమెరికా దేశమున సాధారణమైన కుటుంబమున కగు ఖర్చును జూచిన మన గుండెలు కొట్టుకొనును. కాని అచ్చట సామాన్యమైన పనివానికిగిట్టు కూలియు నట్టిఖర్చునకు తగి యున్నది. అచ్చట ప్రతిమనుజునకును అదాజేయుటకు తగిన యవకాశము గలదు. ఆహారపదార్థము లనేకములు అమెరికా నుంచి బ్రిటను దేశమున కెగుమతి జేయబడుచున్నవి. ఆంగ్లేయ దేశమున 57 రూపాయలు సంపాదించగల మనుజుడు అమెరికాలో 100 రూపాయలు సాధారణముగా సంపాదించగలడు. వ్యాపారముల విరివియందు అమెరికా మొదటిదిగ నున్నది. 1890 సంవత్సరమున అమెరికాలో తయారైన సరకులు 2625 కోట్ల రూపాయల విలువగలిగి యున్నవి. 1888 సంవత్సరమున ఆంగ్లేయదేశమున 1230 కోట్ల రూపాయల సరకులుమాత్రమే తయారు కాబడెను. పనులు హెచ్చిన కొలది కూలి తగ్గుటకు బదులు అమెరికాలో కూలీలకియ్యబడు రేటులు తగ్గించ బడుట లేదు. పనివాండ్రు నేర్పరులుగ నుండుటకును శ్రద్ధతో పనిచేయుటకును తగనప్రోత్సాహమునొసగుచున్నారు. అందుచేత సాలునకు పనివాండ్రలో ఒక్కొక్కడు 900 రూపాయలు మొదలు 1800 రూపాయలవరకు సంపాదించ గలుగుచున్నారు. ఆదాయమునకు మించనికర్చు చేయువారే నిలువజేయ



గలరు. తక్కువసొమ్ము కర్చుజేసి జీవించగలవారును ఆదాకు రెట్టింపుకర్చుచేయువారు నన్ని దేశములలో నుందురు. పూటకూలియింట భుజించువారు అమెరికాలో దినమునకు 12 రూపాయల వరకు చెల్లించవలసి యుండును. సామాన్య కుటుంబములో మనుజునకు సంవత్సరమునకు భోజనమునకు రు 960 లును రు 105 లు దుస్తులకును, ఇంటి అద్దెకు రు 300 లును, వంట చెఱకునకు రు 90 లును, ఇతర కర్చులకు రు 50 లును అమెరికాలో నగుచుండ ఆంగ్లేయదేశములో భోజనమునకు రు 1200 లును, ఇంటిఅద్దెకు రు 200 లును, మిగిలిన ఖర్చులు అమెరికాలో వలెనే యుండుచున్నవి. అమెరికాలో నొక్కొక బండికి బాడుగక్రింద నెలకు 750 రూపాయలుపుచ్చుకొందురు. ఒక్క రాత్రికి 10 రూపాయలకు తక్కువరాదు. కాని బ్రిటను దేశములో బండ్లబాడుగ అమెరికాలో కంటె హెచ్చుగ నున్నది.

సామాన్య జనుల కుపయోగపడు కాఫీ తేయాకుల మీద అమెరికావారు పన్ను విధించుటలేదు. సారాయిపైన ఆంగ్లేయదేశమున గేలనుకు 10 రూపాయల పన్ను వేయబడు చుండగా అమెరికాలో నది రూపాయకంటె నధికముగ లేదు. ఇదేవిధముగ పొగాకుమీద నమెరికాలో పౌనుకు పావులా ఉండగా ఆంగ్లేయదేశమున రెండు రూపాయలన్నర విధింపబడు చున్నది. 'న్యూయన్హాఫ్' అను చరిత్రకారుడు అమెరికాయును ఆంగ్లేయ దేశమును దూదిసరకులలోను వ్యవసాయపు పని ముట్లలోను వంటచెరకులోను సమానముగ నున్నవని తెలియ

జేయుచున్నాడు. అమెరికాకు ముఖ్యపట్టణమైన న్యూయార్కు-పట్టణములో నుపయోగింపబడు బొగ్గునకును లండనులోని బొగ్గునకును వత్యాసముగలదు. అమెరికాలో బొగ్గు ఖరీదు టన్ను 5 రూపాయలు. అమెరికాదేశపు బొగ్గుకంటె లండను బొగ్గు రెట్టింపు ఉపయోగకారిగానున్నది. 'మెకిన్లీబిల్లు' ననుసరించి అమెరికాలో దిగుమతి కాబడునట్టియు తరుచుగ ధనికుల కుపయోగపడునట్టియు పట్టు, సారాయి, పొగాకు, మొదలగు కొన్ని పదార్థముల మీద పన్ను దిట్టముగ విధింపబడుచున్నది.

అమెరికాలో భాగ్యవంతుల కొరకు సంవత్సరమునకు 50 లక్షల రూపాయల విలువగల సంగీతపు సామానులును 3లక్షలకు గడియారములును 40లక్షలకుయంత్రసాధనములును 240 లక్షలకు గాజుసామానులును 300 లక్షలకు తోళ్లును 5 లక్షలకు కాగితమును 8 కోట్లకు ఇనుపసామానులును 130 లక్షలకు రాగియు 360 లక్షలకు దూదిసరకులును 75 లక్షలకు బండ్లును 8 కోట్లకు కొయ్యసామానులును దిగుమతి యగుచున్నవి.

అమెరికావారు వ్యాపారము స్వేచ్ఛగ నుంచగోరినను ఒకప్పుడు ఉక్కు వ్యాపారమున తామితర దేశములకంటె వెనుకబడియున్న కారణముచేత దిగుమతులమీద హెచ్చు పన్నులను విధించి తమ వ్యాపారము నభివృద్ధికి దెచ్చిరి. అందువలన నిపుడు అమెరికావారికి సమానముగా మంచి చవుకైన ఉక్కును తయారుచేయగల వారింకెవ్వరును లేరు. ప్రతిదేశ



మును తనకు కావలసిన సరకులను తయారుచేయ ప్రయత్నించుట సహజము. 1899 సంవత్సరమున అమెరికాలో దిగుమతియైన సరకులు 120 కోట్ల రూపాయలయియుండ నా సంవత్సరము అమెరికావారు తయారుచేసిన సరకులు 2700 కోట్ల రూపాయల విలువగలిగి యున్నవి. ఇప్పుడిప్పుడు ఆంగ్లేయులకును అమెరికావారికిని వివాహ బాంధవ్యములచేతను నివాసముల మార్పుచేతను సహజ సోదరభావముచేతను అన్యోన్య ప్రేమానురాగము లధికమగుచున్నవి. సమానస్థితులందు సౌహార్దభావముండుట సహజము. ఈ విషయమై పూర్వనాగరికతకును నవీననాగరికతకును భేదములున్నటుల గన్పట్టుచున్నది. అందు ప్రజాప్రభుత్వముగల అమెరికనులకును రాజరికముగల ఆంగ్లేయులకును అధిక మైత్రి గలుగుటకు వారిరువురకును వర్తకవ్యాపారములందు గల యాధిక్యతయె ముఖ్యకారణ మనదగును.



# 6. రక్షణపద్ధతి.

ఏదేశమునందైనను అచ్చటి పనితనము లభివృద్ధికావలసియున్న యెడల వానికి రక్షణ మావశ్యకమై యున్నది. చక్కెరవిషయమై అమెరికావారు రక్షణపద్ధతినవలంబించినను ఆవ్యాపారము వృద్ధిబొందలేదు. కాబట్టి కొన్ని సందర్భములలో రక్షణపద్ధతి లాభమును కలుగజేయకపోవచ్చును. ప్రతిసంఘమునందలి విద్యాధికులును బుద్ధిమంతులును ఆదేశమునందు నూతనవ్యాపారములను ప్రబలునటుల జేయుటకు శ్రద్ధతో బనిజేయవలెను. నూతనవ్యాపారములు లేకయే యభివృద్ధిజెందుటకు ప్రయత్నించుట దూలమునకు త్రాడుగట్టి యాత్రాటితో పైకెగురుటకు ప్రయత్నించుట యనదగును. అమెరికాదేశమునందలి రక్షణపద్ధతివలన నచ్చటి సామాన్యజనులకు పన్నుల భారముతగ్గి యది భాగ్యవంతులమీద హెచ్చుగ నేర్పడియున్నది. అమెరికావారు, ప్రస్తుతము హిందూదేశము చీనా మొదలగుచోట్ల జనులు నూతనవ్యాపారములను స్థాపించుటకు ప్రయత్నముచేయుచున్నారనియు అందువలన తమ భావివర్తకస్థితియందు మార్పు కలుగవచ్చుననియు సూచించుచున్నారు.



తాత్కాలిక లాభము తుదకు నష్టహేతువు కావచ్చును. ఒకప్పుడు ఆరంభమున నష్టముకలిగినను కొన్ని వ్యాపారములందు తుదకు లాభము సంప్రాప్తముకాగలదు. రెండుదేశములకు పరస్పరవాణిజ్యలాభములకు మైత్రిప్రధానము. ఏకోస్తాను లాభముండునో ఆవైపునకే సరకులు రవానా చేయబడుచుండును. రాజకీయ విధులకును వర్తకలక్షణములకును పునాదులు సాధారణముగా వేరై యుండి ప్రజలెప్పుడును చట్టములకు బద్ధులై లాభానుకూలమగు పనులయందు మెలగుచుందురు. ఒకరాష్ట్రమునందలి జనుల కైకమత్యము హెచ్చిన కొలది వర్తకవ్యాపారములకు వృద్ధిగలుగుచుండ, రాష్ట్రముల ఐకమత్యమువల్ల ప్రపంచమునందలి వర్తకవ్యాపారముల స్వేచ్ఛ యేర్పడుననుటకు సందియములేదు. అందువల్లనే అమెరికావారికిని ఆంగ్లేయులకును నిరంతరమైత్రి యుండుట రెండుదేశములకు క్షేమకరమని యట్టిస్థితికి భిన్నముకలుగదని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఒక్కొక్కదేశమునకు ఒక్కొక్కవ్యాపారమువల్ల కీర్తిహెచ్చి యితరదేశములచే మన్నించబడుచుండుట చూచుచున్నాము.

బొగ్గుగాని యినుముగాని లేనిపక్షమున నాంగ్లేయదేశమెట్టిస్థితిలో నుండియుండునో యూహింపజాలము. వారికి కావలసిన యాహారపదార్థములలో చాలభాగము అమెరికావారు పంపుచున్నారు. ప్రతిదేశమునకును నచ్చటి సారవంతమగు నేలయు విలువగల గనులును గొప్ప యడవులును ఖ్యాతిని దెచ్చుచున్నవి. అట్టివి హిందూదేశములో సహితము కొరతగా నున్నవని యెవరు చెప్పగలుగుదురు? వాని నుప

యోగమునకు దెచ్చు పద్ధతులు సామాన్యజనుల కెంతమాత్రము దెలియకున్నవి.

వస్తునిర్మాణమునకై యంత్రములనుగూర్చు ప్రతిదేశమునకు తయారుకాని సరకులవశ్యములై సాధారణముగ నితరదేశములనుండి రప్పించుకొనబడుచున్నవి. ఈ కారణముచేత సహితము ఒకదేశము మరియొకదేశము నాశ్రయించి యుండవలసియున్నది. ఫ్రాన్సుదేశమువారు పట్టువ్యాపారమున సుప్రసిద్ధులుగ నున్నారు. ఇప్పుడు హిందూదేశములో నారయంత్రములును, దూదియంత్రములును హెచ్చుచున్నవి. తరుచుగ యంత్రసామగ్రి బొంబాయిలోదిగుమతియగుటనుబట్టి హిందూదేశపుభావిస్థితి అమెరికనులకును ఆంగ్లేయులకును విచారణీయముగ నున్నది. దూరదేశమునకు తయారుకాని సరకులను బంపుటవల్లకాగలుగు బండిబాడుగలు కూలినష్టమును తప్పించుకొనుటకై అభివృద్ధినిగోరెడి ప్రతిసంఘమును ప్రయత్నించుట సహజమేగదా! తొల్దొల్త చిన్నసంఘములవల్ల నేర్పడువ్యాపారములలో నష్టమువచ్చినను చివరకు వీరిప్రయత్నములు కొనసాగుననుట నిశ్చయము. చక్కని నీటిగొట్టముల నమెరికా చవుకగ నిచ్చుటకు సిద్ధముగనున్నను ఆంగ్లేయులు ఎక్కువధరకైనను తమదేశపు యంత్రశాలల నుండినట్టి వస్తువులను కొనుచున్నారని 'కార్నీజీ' వ్రాయుచున్నాడు. ఈ విధముగ నన్నివిషయములలో నమెరికనులేమి యన్యదేశస్థులేమి తమస్వదేశవ్యాపారములను ప్రోత్సాహపరచుచున్నారు. యంత్రముల క్రింద చేతిపనులకు వాసితగ్గినది.



దూదియంత్రములు మొదలగు ముఖ్యయంత్రములను కనిపెట్టిన దాంగ్లేయులై యున్నారు. అందువల్ల నాంగ్లేయుల సహాయము ప్రతిసంఘమునకు నవసరమైయున్నది. ఇదివరలో నేర్పుగలైన పనివాండ్రున్నచోటులకు తయారుకాని వస్తువులు పంపబడుచున్నను, ఇప్పుడుయంత్రములే యట్టి పనులను జేయుటచేత ధనమున్నచోటులకే తయారుకానిసరకులు పంపబడుచున్నవి. ప్రతి దేశమునందలి బుద్ధిమంతులును వివిధవ్యాపారములలో తమ నిపుణత్వము గనుబరచి తమ దేశమునెక్కువ సారవంతముగను ఫలవంతముగను జేయుటకు ప్రయత్నించెదరు. కానిఇట్టిప్రయత్నములో ప్రతిదేశమువారు నేదోవ్యాపారమున ప్రసిద్ధి జెంది లోకమున రాణింపగలిగెదరు. ఫ్రాన్సుదేశపు ఫసందును, ఆంగ్లేయుల యంత్రసామర్థ్యమును ఇప్పటివరకు నితరులకు సాధ్యము కాలేదు. అమెరికావారి విద్యుచ్ఛక్తి ప్రభావములకును జర్మనీవారిరంగులనేర్పునకును సాటిలేదు. నిన్నటివరకు సాధారణముగ నున్న దేశములలో క్రొత్తవింతలు బయలుదేరి విద్యుచ్ఛక్తి ప్రభావముచేతగాని వనౌషధులవల్లగాని యచ్చటివ్యాపారములస్థితిమారవచ్చును. నీలిమందువర్తక మెటులమార్పుచెందినది! కర్పూరము, చక్కెర మొదలైనవిగూడ నూతనముగా కనుగొనబడిన సంగతులవల్ల మార్పుచెందుచున్నవి. 'మెసాబా' ఇనుపగనులవల్ల నమెరికా ప్రసిద్ధిజెందెను. జర్మనీదేశములో ఉక్కుచేయబడు పద్ధతి ప్రశస్తమై యున్నది. అమెరికా మొదలగుదేశములలో నీటిప్రవాహములనుండి విద్యుచ్ఛక్తిని స్వీకరించి యచ్చటివా రనేక

చిత్రములనుచేయుచున్నారు. పైకారణములనుబట్టి ఏసంఘము వారును తమయొక్క స్థితినిగురించి మనస్తాపము జెందవలసిన పనిలేదు. ధైర్యముతో ప్రతిసంఘమును తమ వర్తకవ్యాపారముల రక్షించుకొన ప్రయత్నించినయెడల ఔన్నత్య స్థితిని పొందగలుగుట నిశ్చయము.

చిన్నమొక్కలకు చుట్టు కంచవేసి కొన్నాళ్లు గాపాడి యవి పెద్దవృక్షములైనపిమ్మట యట్టి కంచలతో నవసరము లేనివిధంబున నూతనవర్తకసంఘములను స్వల్పమూలధనముగల వానిని పోటీలనుండిదప్పించి రక్షించినయెడల శీఘ్రకాలములో నవి తలయెత్తి పోటీలను లక్ష్యముచేయక నిలువగలవు. ప్రపంచములో వర్తకవ్యాపారములందు ప్రసిద్ధిగాంచిన దేశములును సంఘములును మొదట నట్టిరక్షణయందు కొంతకాలము బెరిగి యిప్పుడు స్వేచ్ఛగా నుండుచున్నవి. తిన్నగా కన్నులు దెరవని పసివారిని తమతో సమానముగా నుండుడని కోరుట బెద్దవారికి దగదుగదా. స్వయంసహాయమువల్ల నాత్మరక్షణ యెట్టి యాపద్ధర్మమో నూతన వ్యాపార రక్షణయు నట్టి ధర్మమని నమ్ముడు.



# 7. దిగుమతులపై పన్ను.

నూరు సంవత్సరములకు బూర్వము అమెరికా దేశము వారు తమకు కావలసిన వస్తుసామగ్రిలో చాలభాగము నన్యదేశములనుండి రప్పించుకొనెడి స్థితియందుండిన వారు. ఇప్పుడన్ననో ప్రపంచమునకెల్ల విరివియైన యంత్రశాలలు గలిగి తమకు కావలసిన వస్తువులను తమ దేశములో చేసికొనుచు అన్యదేశములకు విశేషముగా నెగుమతి చేయుచున్నారు. అమెరికా చరిత్రను గురించిన సంగతులలో ముఖ్యముగనచ్చటి సంయుక్తరాష్ట్రములను గురించియే యెక్కువ సంగతులు మనకు తెలియగలవు. ఆంగ్లేయుల రాజ్యపద్ధతికిని అమెరికా రాజ్యపద్ధతికిని తారతమ్యముగలదు. అమెరికా దేశమున ప్రజాపరిపాలనముగలదు. ఆంగ్లేయులకును జపానీయులకును అమెరికనులకును తమ వర్తక వ్యాపారములను కాపాడుకొనుటకు సమానమైన స్వాతంత్ర్యాధికారములు గలవు. అన్యదేశ వ్యాపారములను నిరోధించుటకుగల శక్తి ప్రతిరాజ్యమునకు గలదు. కాని అన్నిదేశముల వారు కొన్ని విషయములలో దప్ప వ్యాపారములను స్వేచ్ఛగ నితరదేశములతో జేయుటయే క్షేమకరమని నమ్మి ప్రవర్తించుకొనుచున్నారు. ఆంగ్లేయులును అమెరికనులును ఒక తెగవారేయైయునారు. రెండు దేశముల వారికిని నిరంతర మైత్రియుండుట సహజమును వర్త

కాభివృద్ధికి రెండుదేశములకు నవసరమునునై యున్నది. అమెరికనులు సాహసమునందుగాని చొరవయందుగాని చురుకుదనమున గాని నడవడియందుగాని ఆంగ్లేయులకు తీసిపోరు.

సంయుక్తరాష్ట్రములలో 1895 సంవత్సరమున వర్తకవ్యాపారములవల్ల వచ్చిన ఆదాయము 120 కోట్ల రూపాయలు వ్యయము 128 కోట్ల రూపాయలుగ లెక్కలవల్ల గన్పించుచున్నది. ఆదాలో 48 కోట్ల రూపాయలు కేవలము దిగుమతి సరకులమీద విధింపబడిన పన్నువల్ల వసూలుకాబడెను. 1901 సంవత్సరములో 177 కోట్ల రూపాయల ఆదాయమును 150 కోట్ల రూపాయల వ్యయమును కనుపించుచున్నది. దిగుమతి సరకులలో పన్ను వేయబడిన వానిలో ఆహారపదార్థములు జేరియుండలేదు. వినోదార్థము కొని యుపయోగించబడు విలువగల పదార్థముల కిమ్మతులను హెచ్చించుటవల్ల భాగ్యవంతులకు భారమై బీదలకును పనివాండ్రకును లాభకరముగనుండెను. సామాన్యజనులు దేశవాళీ సరకుల నుపయోగించెదరు. దేశవాళీసరకుల ధరకును విదేశవస్తువుల ధరకును చాల వ్యత్యాసము గలదు. కాని దేశవాళీ సరకులు మొదట అమెరికాలో సహితము మోటుగానుండి ఆంగ్లేయుల సరకులవలె మృదువుగానుండ లేదు. తమ సరకులనే విరివిగా నుపయోగించుకొనిన కొంతకాలమునకు మృదువైన సరకులను తాము తయారు జేయగలుగుదుమనెడు నమ్మకము అమెరికనులకు గలదని వారి యాచరణవల్ల స్పష్టమగుచున్నది. ఆంగ్లేయులతో సమానముగ బట్టలు తయారు చేయుటకు అమెరికా వా



కనేక సంవత్సరములు పట్టవచ్చును. అమెరికా దేశములో నుపయోగింపబడెడు ప్రతినూరుగజముల బట్టలలోను 6 గజములు మాత్రమే విదేశసరకు లుండును. శేషించినదంతయు దేశవాళీ సరకు. ఇందుకు నిదర్శనముగా 1890 సంవత్సరములో దేశవాళీ దుస్తులు 102 కోట్ల రూపాయల కిమ్మతుగలవి, 11 కోట్ల రూపాయల కిమ్మతుగల విదేశదుస్తులును అమెరికను లుపయోగించినారు. అటువలెనే దూదిసరకులు దేశవాళివి 87 కోట్ల రూపాయలవియు, విదేశసరకులు 9 కోట్ల రూపాయలవియు, పట్టుసరకులు దేశవాళీవి 21 కోట్లరూపాయలవియు, విదేశపు సరకులు. 9 కోట్ల రూపాయలవియుగ లెక్కలవల్ల తేలుచున్నది.

ప్రతి రాజ్యమునందును వర్తకాదాయమునుండి వచ్చు పన్నులవల్ల సర్కారు రివిన్యూ చాలవరకు పూర్తియగుచున్నది. ఆంగ్లేయరాజ్యములోవలెగాక అమెరికావారు ఆదాయపు పన్నును విధించుటలేదు. అమెరికావారి యభిప్రాయములో ఆదాయపుపన్ను యుద్ధసమయములందు తప్ప మిగిలిన కాలములందుండ కూడదని తెలియుచున్నది. అమెరికాదేశమునకు ఇతర దేశములనుంచి దిగుమతి యయ్యెడు తయారు కాని సరకులు తయారుచేయబడి యెగుమతిచేయబడు పక్షమున వానిపైన పన్నులు విధించుటలేదు. చక్కెరపైన ఆంగ్లేయరాజ్యము నందువలెనే అమెరికావారును పన్ను విధించుటలేదు. అమెరికాలో సాలునకు 36 కోట్ల రూపాయల కిమ్మతుగల చక్కెర ఉపయోగింపబడుచున్నది. ఇతర దేశములకంటె

బ్రిటను దేశమును అమెరికా దేశమును వర్తక వ్యాపారములం దగ్రగణ్యముగా నున్నవి. ఈ రెండు దేశములలో భోజన పదార్థముల ధర హెచ్చుగానున్నది. జనులయొక్క రాబడియు తదనుకూలముగా నున్నది.

అమెరికాదేశమునకు నాంగ్లేయదేశమునకు ముఖ్యమైన భేద మొకటిగలదు. ఆంగ్లేయ దేశము చిన్న లంక. అమెరికా పెద్దఖండము. ఆంగ్లేయదేశమున ప్రత్తి పైరు లేదు. వారికి గావలసిన యాహారపదార్థములకు నన్యదేశముల నాశ్రయించి యుండవలెను. అమెరికావారికి మనహిందూదేశమువలె నన్ని విధములైన సాధనసామాగ్రికలదు. పన్నులభారము వర్తకము నకును వ్యాపారమునకును గొంతవరకు ప్రోత్సాహమును దగ్గించవచ్చును. గాని నిజముగ నూతన వ్యాపారమును కొన సాగించవలెనను దీక్షగలవా రెన్నిపన్నులుండినను సంపన్ను లుగా గలరు. పిఱికిదన మెన్నడును వర్తకులను బాధించదు. పన్నులకు భయపడువారు వర్తకమును నెరవేర్చజాలరు. తమ కుగల మంచిసరకులను తయారుజేసి తగిన ధరల నేర్పరిచి పన్నులభారమును తగ్గించుకొనుటకు వర్తకు లుపాయములను వెదకుచుందురు.



## 8. వర్తక సంఘములు.

సాధారణముగా ప్రతిదేశములోను మొదట నల్పప్రా రంభముననుండు వ్యాపారములు శీఘ్రకాలములో విరివిగ వ్యాపించి యటువిమ్మట నిలకడను జెందుచున్నవి. ఏవస్తువున కైనను దాని సప్లయికి మించి ఖర్చుబడుటకు అవకాశముండిన పక్షమున దాని ధరహెచ్చుటకు కారణ మగుచున్నది. అట్టి సంగతిని కనిపెట్టి వర్తకులు నూతన యంత్రశాలలను వేలం వెఱ్ఱిగ స్థాపించుటకు ప్రారంభించెదరు. గొఱ్ఱెదాటుచందమున నొకరు మార్గము చూపిన పద్ధతి తప్ప నూతన పద్ధతులందు, సాహసముగలవారుగాక యన్యులు ప్రవేశించరు. అందరును ఒకటేవిధమగు వ్యాపారములందు తమ మూలధనము నుప యోగించిన చివరకు తయారగు సరకులను ఖర్చుపెట్టుటకు మార్గములేక వానిధర తగ్గింప నష్టము సంభవించును. ఇట్టి స్థితిలో నెక్కువ మూలధనముతోను యంత్ర సహాయము తోను పనిచేయుచుండు కొన్ని పెద్దసంఘములుదప్ప నితరులు దమ వర్తకశాలలను మూసి యంత్రశాలల నితరపనులకు నుప యోగపరచుకొనుట పెక్కండ్రకు అనుభవనీయమైయున్నది. పెద్దసంఘములు సహితము ఖర్చుపడుటకు సదుపాయము లేనప్పుడు సరకులను తయారుచేయక మానుకొన్నచో సరకు లను తక్కువధరల కమ్ముటకంటె నెక్కువ నష్టమును భరించ

వలసినవారగుచున్నారు. ఏలననగా నట్టి పెద్దయంత్రశాలలకు పనియుండినను లేకపోయినను తప్పనిసరి బాపతు ఖర్చులు 20 విధములకు పైగానుండును. అందుచేత పనిని బొత్తిగా మానినపక్షమున వెంటనే దివాలా సంప్రాప్తమగును. గనుక కొంతకాలము స్వల్పనష్టమునైనను భరించుచు పెద్ద యంత్ర శాలలవారు పనులనుచేయుచునే యుందురు.

ఎప్పుడు సరకులకు గిరాకియుండదో యప్పుడు ప్రతి యంత్రశాలలోని వర్తకునకు నలజడి హెచ్చును. అప్పుడు వర్తకసంఘమున కాపదధర్మము నన్వేషించుట కద నేర్పడు చున్నది. 'సమావస్థుల్ గదా స్నేహితుల్' అని జెప్పినటుల వర్తకుల కట్టి యవస్థయందైకమత్యము సహజముగ గలుగు చున్నది. అదివరలో నెవరికి వారే యని పోటాపోటీగా వ్యాపారము చేయుచుండినవారు అన్యోన్యాశ్రయులై సంధి ప్రకరణము నాలోచించెదరు. వారికందరకును సమానముగా కావలసినవి, వారు తయారుచేయుచుండిన సరకులు ఖర్చుపడు టయు ధరలు తగ్గకుండుటయునై యున్నవి. వీరికి ప్రత్యేకించి సాధ్యముగాని సంరక్షణ, ఐకమత్యమువల్ల సాధ్యమగుచున్నది. అందునకు వర్తకులందరునుగలిసి పోటీలనుమానుకొని నిలుకడ ధర నేర్పాటుజేసి లాభనష్టములందు సమానబాధ్యులగుటకు ప్రయత్నించుదురు. అట్టి సంఘీభావ మొక రాష్ట్రమునందు గాని ఖండమునందుగాని సాధ్యపడవచ్చునుగాని ప్రపంచము లోని యితరదేశముల పోటీ నాపుటకు సాధ్యముకాదు. ఈ సంఘీభావపుపద్ధతి సృష్టియం దిక్కట్టుల సమయముల యం



దనేక విషయములయందు జూపట్టెడిని. కాని, ఇవ్విధముగ వర్తకసంరక్షణపద్ధతి శ్లాఘనీయముగాని చివరకు లాభకారిగాని కాదని కొందరభిప్రాయపడుచున్నారు.

అమెరికాయందలి వర్తకసంఘముల స్థితి 'ట్రస్టు'లనెడి సంఘప్రకరణములతో నిండియున్నది. ఫ్రాంసు దేశమునందలి రాగివ్యాపారమును ఆంగ్లేయుల ఉప్పువ్యాపారమును జర్మనీ వారి తీగవ్యాపారమును నట్టి ట్రస్టులచే నిలుపబడుచున్నవి. కాని ఈట్రస్టు లేర్పడిన సంగతి తెలిసినవెంటనే క్రొత్తసంఘ ములు హెచ్చుటకు కారణమగుచున్నది. వానినిగూడ ట్రస్టు లలో కలుపవలసిన విధియుండును. లేనిచో పోటీవచ్చును. ఆ ప్రకారము క్రొత్త యంత్రశాలలు హెచ్చిన కొలది ట్రస్టుల పునాదికి భంగము కలిగి నష్టము సంప్రాప్తమగుట నిశ్చయమె గదా. అమెరికాలోని రైలురోడ్డులవారు సహితము సంఘ ములుగ నేర్పడి రేటుల నేర్పరచుచున్నారు. కిరసనాయిలు వర్తకము స్టాండర్డునూనె కంపెనివారిచేతిలో నున్నది. ఈ గొప్ప వ్యాపారముల ట్రస్టులు విశేషము తెలివిగలవారిచే నిర్వర్తింప బడుచున్నవి. ఒకవేళ ట్రస్టులవల్ల నధికలాభమును సంపాదించ వలెనని ప్రయత్నము జరిగిన పక్షమున అసలునకే మోసము సంభవించును.

అమెరికా ఖండమున ప్రయాణము ఖర్చులు తక్కువ గుటచేత సరకుల నొకచోటనుండి మరియొక చోటునకు బంపు టకు ఆంగ్లేయదేశముకంటె నమెరికాలో మూడింతలు చవు కైన రేటులుగలవు. వ్యాపారాభివృద్ధి యెల్లప్పుడును రవా

ధారి ఖర్చులను బట్టియుండును. ట్రస్టులవల్ల నొకవేళ కొంత వరకు పెట్టుబడి నిచ్చినవారికి కొంతకాలము నష్టము కలుగకుండ చేయుటకు వీలుండినను అవి రహాధారి ఖర్చులను తగ్గించుటకు సహకారి కాజాలవు. ట్రస్టులెన్నటికిని సరియైన రక్షణ నియ్యజాలవు. బలహీనులకు బలవంతులతో పోటీవచ్చినప్పుడు కనబరిచెడి దౌర్బల్య లక్షణముగా నీట్రస్టుల నెల్లవారును పరిగణించుచున్నారు. పర్యవసానమున దేశానర్థకమగు పనులలో నితరులలో పైపోటికి దిగుటకంటె నూతన వ్యాపారములను నెలకొల్పుటకన్ని దేశములవారును పనిజేయుట కర్తవ్యము.

అన్యోన్యసహాయసంఘముల కెప్పుడును లాభనష్టములందు సమానబాధ్యతగలదు. అమెరికాలో నేర్పడిన ట్రస్టులెన్నియో దివాలాజెంది వర్తకమునకు చాలా నష్టమును కలిగించియున్నవి. ఒకరు బియ్యపుమరవ్యాపారమును ప్రారంభించిన నెందరట్టి మరలను జేర్చి యంత్రశాలలను గట్టిన సంవత్సరములోపల మూసియుండిరో యాంధ్రమండలమున బెక్కండ్రు వర్తకులకు దెలిసిన సంగతే. బాల్యమునందున్న వర్తకసంఘములకు నష్టము సంభవించినయెడల వానియభివృద్ధికి నాటంకముగలుగును. కాబట్టియమెరికా వారిలోభిన్న వ్యాపారములు జేయక యొక్కటేవ్యాపారమున బెక్కుసంఘములు ప్రవేశించి ట్రస్టులలో దగులుకొని సుడిబడి మునుంగుచున్న సంగతిని బాగుగా దెలిసికొనుడు.



## ౯. బొగ్గుపొగ.

ఇదివరలో కార్నెజీ కొద్దినౌకరినుంచి కోటీశ్వరుడైనట్లు వ్రాసియుంటిని. కొంతకాలము దూదియంత్రశాలలో నెలకు 15 రూపాయల జీతము తెచ్చుకొనుచు తరువాత రయిల్వేలో టెలిగ్రాఫుపనులందు నెలకు 75 రూపాయల జీతమును సంపాదించుచుండెను. కొలువునందుండినను స్వతంత్ర వ్యాపారములందు భాగస్థుడుగ జేరుట కెప్పుడును ఈయన కోరుచుండెడివాడు. అమెరికాలో కూలిహెచ్చినకొలది ధరలు తగ్గి నిలవధనమును చేర్చుట కెక్కువ అవకాశము కలిగెను. కార్నెజీ రయిళ్ళపనిలో చాలవరకు పనిచేసి యుండెను. అప్పట్లో రయిళ్లు స్వల్పముగనుండెను. 47 అతుకులతో మొదటి రయిలుపట్టా వేయబడియుండెను. గంటకు 27 మైళ్లుపోగల రయిళ్లను కొంతకాలమునకు సంపాదించి ఇప్పుడు గంటకు 54 మయిళ్లు నడపించుచున్నారు. జాగ్రతయు, ధైర్యమును, నమ్మకమునుగలిగి త్రాగుబోతులుగానట్టి పనివాండ్రు ముందునకువచ్చుట సహజము. బొగ్గునకై అమెరికావారి కెక్కువ కష్టములేకపోయెను. బొగ్గునకు వెదకుచుండగా కిరసనాయిలును, బొగ్గుపొగయు వారికి చిక్కినవి.

మన దేశములోవలెగాక విశేషములోతు త్రవ్వవలసిన అవసరములేకయే పశ్చిమ పెన్సిల్వేనియా రాష్ట్రమున 7 అడు

గుల లోతున 200 చదరపుమైళ్ళ పట్టున టన్ను 2 రూపాయల చొప్పున బొగ్గునుసి చిక్కుచున్నది. 1882 సంవత్సరమున 14 కోట్ల తట్టల బొగ్గు గనులనుండి తీయబడినది. వెస్టుమోరు రాష్ట్రమున బొగ్గుగనులు 5 అడుగల లోతుననుండి రెండు నదుల మధ్య నుండుటచేత నచ్చట టన్ను బొగ్గు 2 రూపాయలకు తక్కువ గిట్టుచున్నది. అచ్చట సాలునకు .70 లక్షల టన్నుల బొగ్గు తీయబడుచున్నది. “పిట్సు బర్గు”నకు నూరుమైళ్ళు ఉత్తరముగా నూనెగడ్డగలదు. 36 సంవత్సరముల క్రిందట దినమునకు 100 డబ్బాల నూనె రాదగిన నూయిగల 'స్త్రోత్రే'పొలము కార్నిజీ లక్షరూపాయలకు కొనియుండెను. ఇప్పుడు దాని కిమ్మతు కోటిన్నర రూపాయలు. సంవత్సరమునకు 30,000 రూపాయల ఆదా పెట్టుబడి సొమ్ము పైనగిట్టుచున్నది. కిరసనాయిలు అనే నూనెయొక్క సంగతి తెలియనప్పుడు దాని నౌషధముగనెంచి శెనికానూనె యను పేరిట 6 రూపాయలకు బుడ్డిచొప్పున విక్రయించుచుండెడివారు. ఇప్పుడన్ననో బుడ్డి అర్ధణా చొప్పున గిట్టుచున్నది. 1885 సంవత్సరమునం దా ప్రాంతమున ఒక దినమునకు 70,000 డబ్బాల నూనెను తీయుచుండిరి. కొన్ని సంవత్సరములవరకు ప్రపంచమునకు సప్లయికి చాలినంత కిరసనాయిలు 4 కోట్ల డబ్బాలవరకు నిలువయున్నది. 1877 సంవత్సరమున నెగుమతియైన నూనెకంటె 1883 సంవత్సరమున రెట్టింపునూనె ఎగుమతియైనది. 1877 సంవత్సరమున 18 కోట్ల రూపాయల కిమ్మతుగలిగియుండినది 1883 సంవత్సరమున 10 కోట్ల రూపాయల కిమ్మతుగలిగినదిగా



నుండెను. నూనె కొరకు అమెరికావా రనేకచోట్లత్రవ్వి కొన్నిచోట్ల నేమియు గానక పరాభవపడినను వారిపట్టుదలను మానినవారు కారు.

“పిట్సుబర్గు”న కీశాన్యముగ 900 అడుగుల లోతులవరకు యంత్రసహాయముతో త్రవ్వి 1870 సంవత్సరమున తుదకేమియు చిక్కనందున నప్పటి కాపట్టునువిడిచిరి. కాని మరియొకరు ఆ ప్రయత్నమునందే కంకణముకట్టుకొని 1320 అడుగుల లోతువరకు త్రవ్వగా నచ్చట పిడుగువంటి శబ్దముతో చుట్టుప్రదేశము బద్దలై 5 మైళ్లవరకు నాధ్వని వినిపించెను. వెంటనే ఆ క్రొత్త నూతిని గొట్టములతో కలియజేర్చి యా గొట్టముల ద్వారావచ్చు బొగ్గుపొగతో దీపములను వెలిగించుటకు నమెరికావారు ప్రారంభించిరి. మొదటి 5 సంవత్సరములవరకు ధనముగలవారే తమ సొమ్మును గొట్టములందు వినియోగించి యంత్రశాలలను నూతితో కలియగట్టుటకు సంశయించిరి. అందునకు 6 లక్షలరూపాయలైన అధమము కావలసియుండెను. కాని ఒకరు దొరవచేసిన వెంటనే చాలగా క్రొత్తనూతులు త్రవ్వబడసాగెను. 1885 సంవత్సరము నాటికి 9 నూతు లేర్పడినవి. అందు మూడు పెద్దనూతుల బొగ్గుపొగ గాలిలోనికి తప్పించుకొనిపోవుచుండెను. ఆరంగుళముల గొట్టమునుంచి నేలపైన 20 అడుగుల ఎత్తుననున్న గొట్టముచివర 6 అడుగులు పైగా నాకసమునందా యనునట్లు వింతగ వెలుగు దేదీప్యమానముగ నుండుటయు నచ్చట నించుకైన పొగ లేమియు చూచువారికి కన్నులపండువగనుండెను. ప్రస్తుతము

రయిళ్ళలోను, పెండ్లిండ్లలోను పెద్దబస్తీలలోను, భాగ్యవంతులయిండ్లలోనునట్టి బొగ్గుపొగదీపములను మన దేశములో సహితము జూచుచున్నాము.

బొగ్గుపొగ నూతులలో పెద్దదానివల్ల దినమునకు 3 కోట్ల నికరపుటడుగుల గ్యాసు వచ్చుచున్నది. నూతి మొదట పొగ వేగమునకుగల విజృంభణము చదరపు టంగుళమునకు 8 మణుగులుండును. నూతికి 9 మైళ్లదూరమున నట్టిశక్తి 3 మణుగులవరకుండును. పొగవచ్చెడి గొట్టములు చాల చల్లగ నుండును. పొగ గాలికితగిలినమీదగాని జ్వాల ప్రజ్వరిల్లదు. పొగ నూతులు 'టారింటను' 'వాషిన్గటను' జిల్లాలలో కొంచెముగను 'మర్రెస్విలు' జిల్లాలో హెచ్చుగననగా 6 మైళ్ళపొడవున అరమైలు వెడల్పుగల భూమియందును గలవు. కొన్నిచోట్ల ఉప్పు నీటి ప్రాంతము అడ్డమై పొగనురానియ్యకుండెను. ఈ నూతులను త్రవ్వుటలో అమెరికనులు తమ శక్తిని చురుకుదనమును వినియోగించిరి. ఇప్పుడు దినమునకు 70 వేల పెద్దడబ్బాల బొగ్గుపొగను తీయుచున్నారు. పూర్వము 90 మంది అగ్గిపని వాండ్రు యంత్రముదగ్గర 400 టన్నుల బొగ్గుతో దినమంతయు పనిజేయుచుండ నిప్పుడొక్కడే బొగ్గుపొగతో యంత్రమును పనిచేయించగలుగుచున్నాడు. యంత్రశాలలు సున్నము కొట్టబడి పొగయన్నమాటలేక యంత్రములు విశేషకాలముండుటకవకాశ మేర్పడుచున్నది. నీటిలోని హైడ్రజనుగాలికి తరువాత బొగ్గుపొగయే చాలాతీవ్రమయినది. ఒక పౌను బొగ్గుపొగ 20 పౌనుల నీటిని ఆవిరిగ మార్చగలుగుచున్నది. బొగ్గుపొగలో



పల్లపునేలలందుండు కొరివిదయ్యము లేర్పడుగాలి చాలభాగముండును. వేడిచే భూమ్యంతర్భాగమున వృక్షజాతులుబొగ్గుగ మారుచుండ నావేడితీవ్రముబట్టి యందలి మరియొక మార్పు నూనెయును అందుపైన బొగ్గుపొగయు క్రమక్రమముగ నేర్పడుట సహజముగ కన్పించుచున్నది. ఇప్పుడు తరుచుగా బొగ్గుపొగ పూర్వమంత చిక్కుటలేదు. అందుచేత దానిని మితముగ కొలిచి వాడుకచేయుచున్నారు.

ఇదిగాక నూతనశాస్త్ర పద్ధతులవల్ల కిరసనాయిలు నుంచి పొగనువిడతీసి దీపములను వెలిగించుచున్నారు. మొదట బొగ్గుపొగ దీపములు అమెరికాయందలి వాషింగ్టను పట్టణములో వెలువడినందునను ఇప్పటికిని మనకు నాదీపములకు కావలసిన యంత్రసామగ్రిని వాషింగ్టను వర్తకసంఘముల వారు బంపుచుండుటచేత నీదీపములను తరుచుగ వాషింగ్టను దీపములని వ్యవహరించుచున్నారు. గొట్టములనుండి ఈపొగ తప్పించుకొని గదులలోనికివ్యాపించిన ప్రమాదములకు గారణమగును. దీనివాసన దుస్సహమై ప్రాణోపద్రవమునకు కారణము కాగలదు. విద్యుచ్ఛక్తి దీపములతో తుల్యమగు నీదీపములను గలుగజేయుట కమెరికావారి నెంతయో కొనియాడదగియున్నది.



# 10. ఉక్కు.

అమెరికా దేశమునకు ఉక్కువల్ల ప్రాశస్త్యము వచ్చినదని దెలిసియున్నది. 1786 సంవత్సరము నాటికి అమెరికా రాజ్యమువారు 'హామ్ఫ్రిస్' అను నతనికి సాలునకు 4500 రూపాయల చొప్పున 5 సంవత్సరముల వరకు నాంగ్లేయదేశములో తయారగునంతటి మంచి యుక్కును తయారుచేయుటకు ధనము నరువిచ్చియుండిరి. అమెరికా ఖండమునందలి సంయుక్తరాష్ట్రములందు 1810 సంవత్సరములో 917 టన్నుల ఉక్కు తయారుచేయబడినది. టన్ననగా 4 పుట్లన్నర. 1831 సంవత్సరము నాటికి 1600 టన్నుల ఉక్కును అమెరికావారు చేయగలిగిరి. ఆ సంవత్సరము వారన్యదేశములనుండి మఱియొక 1600 టన్నుల ఉక్కును దెచ్చుకొని యుండిరి. అప్పటివరకు ఉక్కును తయారుచేయు పద్ధతి మోటుగ శ్రీమెంటువల్ల సాధించుచుండిరి. వంచుట కనుకూలమైన ఉక్కు తయారగుట ప్రారంభమైనది లగాయతు అమెరికాలో యంత్రశాలలు హెచ్చుగ కట్టబడినవి. 1840 లో 'పిట్సుబర్గు' యంత్రశాలయును, 1853 లో 'సింగరు' యంత్రశాలయును, 1860 లో 'హాస్సే' కంపెనీవారి యంత్రశాలయును, మంచి ఉక్కును తయారుచేయ ప్రారంభించినవి. 1862 సంవత్సరమున పార్కు కంపెనీవారు నట్టిపనిని ప్రారంభించిరి. ఈ కంపెనీలన్నియు లక్షలకొలది మూలధనముకలిగి వేలకొలది కూలీలతో పని జేయునవై యున్నవి. 1810 సంవత్సరములో 531 టన్నుల ఉక్కును తయారుచేయగలిగిన 'పెన్సిల్వేనియా' రాష్ట్రములో 1850 సంవత్సరమున ఆరువేల టన్నుల ఉక్కు చేయబడినది. ఆంగ్లేయులంతట అమెరికావారికన్న చవుకగ తమ సరకులను అమెరికా అంగళ్లలో నమ్మసాగిరి. అప్పటికిని అమెరికనులు నిరుత్సాహులుగాక తమ భల్లూకపుపట్టునువిడువక తమ దేశమునకు కావలసిన వస్తువులనెల్ల తయారుచేసి యమ్ముచుండిరి. ఈ ప్రకారము తమకు కావలసినంతవరకు తాముజేసిన సరకుల నుపయోగించుకొని శేషించిన తమ సరకుల నన్యదేశములకు తక్కువ ధరలకు పంపుటకు అమెరికనులకు శక్తి కలిగెను.

1864 సంవత్సరమున ఆంగ్లేయుల ఉక్కునకు బోల్పదగిన 'బెస్సెమరు' ఉక్కును అమెరికావారు తయారుచేయగలిగిరి. అంతట ఉక్కుధర వీశె ముప్పావలానుంచి 2 అణాలకు తగ్గినది. గనులలోనుంచి త్రవ్వబడి వెయ్యిమైళ్ళ దూరము తీసికొనిపోబడు 2 పౌనుల ఇనప త్రుప్పును 50 మైళ్ల దూరమునందలి బొగ్గుగనులనుండి తీయబడిన ఒకటింబాతిక పౌనుల బొగ్గును పౌనులో మూడవవంతు సున్నపురాయిని 140 మైళ్ళ దూరమునుండి త్రవ్వితెచ్చికలిపి కరిగించినప్పుడు వచ్చు 1 పౌను ఉక్కు అమెరికావారికి వీశె బేడకు గిట్టుటకంటె వింతయేమి యుండును! ఆ యంత్రశాలలలో 1200 అడుగుల పొడవుగల హాలులో ఒకవైపున పైసామగ్రి నుంచిన రెండవ వైపు

నుంచి తయారైన ఉక్కుఖడ్గములు యంత్ర సహాయముచేత బయలు వెడలుచున్నవి. చక్కని యంత్రములును, విద్యుచ్ఛక్తియును, ఎగుమతి దిగుమతులకు సులభమగు చిన్న యంత్రములును, ఉక్కుధరను చవుక చేయుటకు తోడ్పడినవి. ఈ యంత్రశాలలలో పనిజేయు వారెప్పటికప్పుడు నూతన పద్ధతులను కనుగొనుట కొఱకీ విషయమున నెక్కువ పరిశ్రమజేసి మార్పులనుతరచుగ జేయుచుండిరి.

అదివరలో నినుము కరిగెడిమూసలు మూయబడియుంచబడుచుండెను. 1883 సంవత్సరములో 'సిమన్సు' అను నతడు మూసలను తెరచియుంచి కరిగెడు పద్ధతి నేర్పరిచెను. దానిని మొదట కూపరు కంపెనీ వారవలంబించినారు. అటు పిమ్మట తామసు అను నతడు త్రుప్పును ఇనుముగా మార్చకుండ ఒక్కసారే ఉక్కునకు మార్చుట కేర్పరచిన పద్ధతివల్లనది మూతలేని మూసలలో సులభముగ జేయుట కనుకూలముగ నుండెను. గనుల బొగ్గుకంటె బొగ్గునుసి నుపయోగించుటవల్ల ప్రశస్తమైన ఉక్కువచ్చుచున్నది. ఆంగ్లేయులు బొగ్గునుసి నెక్కువగా నుపయోగించుచున్నారు. త్రుప్పునుంచి తయారయిన ఉక్కు గుర్రపు నాడాలకు నుపయోగించ బడుచున్నది. వంతెనలకు వేయు ఉక్కు ప్రశస్తమైనది. కార్నీజీ కంపెనీవారు విశేషముగ నిట్టి ఉక్కును తయారుచేయుచున్నారు. అమెరికాలోని ఉక్కుగనులు పిట్సుబర్గుపట్టణము చుట్టును ఉన్నవి. 1869 సంవత్సరములో తయారైన ఉక్కులో అల్లిగనీనుండి ముప్పాతిక మూడు వీసములు వచ్చియున్నది. అమెరికాలో



చేయబడు ఉక్కుకంటె జర్మనీలోను ఆంగ్లేయదేశములోను చాల తక్కువ ఉక్కు తయారగుచున్నది. చీనా వారికిని జపాను వారికిని గల ఉక్కు అత్యల్పము. ఇప్పుడు అమెరికాలో నిలవయున్న ఇనుము 50 సంవత్సరముల వరకు చాల గలదు.

1900 సంవత్సరములో అమెరికానుండి ఎగుమతిఅయిన ఉక్కు 387 కోట్ల రూపాయల కిమ్మతుకలిగియున్నది. ఉక్కు చవుకయనగా ఓడలు యంత్రములు మొదలయిన వన్నియు చవుకయని స్పష్టముగా తెలియుచున్న విషయమేగనుక అన్ని దేశములవారును అమెరికాతో నెయ్యమందుట అవశ్యకమై యున్నది. 1873 సంవత్సరములో సంయుక్తరాష్ట్రములలో 2 లక్షల టన్నుల ఉక్కును ఆంగ్లేయదేశమున ఆరున్నర లక్షల టన్నుల ఉక్కును తయారుకాబడెను. 1899 సంవత్సరములో సంయుక్త రాష్ట్రములలో 106 లక్షల టన్నుల ఉక్కును ఆంగ్లేయదేశమున 50 లక్షల టన్నుల ఉక్కును తయారుకాబడెను. 1899 సంవత్సరములో ప్రపంచములో తయారైన ఉక్కంతయు 270 లక్షల టన్నులయియుండుటచేత దాదాపు సగము అమెరికానుండి వచ్చుచున్నట్లు గనుపించుచున్నది. జర్మనీలో ఏటా 80 లక్షల టన్నుల ఉక్కు చేయబడుచున్నది అమెరికాలో కార్నీజీ కంపెనీవారి యంత్రశాలనుండి నెలకు 20 లక్షల టన్నుల ఉక్కు తయారగుచున్నది. జర్మనీవారు రక్షణపద్ధతి నవలంభించి కొంతవరకు నితరదేశముల ఉక్కును ఆపుదలచేయుచున్నారు. కాని అట్టి పద్ధతివల్ల సామాన్య జను

లకు శీఘ్రకాలములో లాభము కలుగనిపక్షమున నట్టి పద్ధతి దుర్భరముగనుండును. అంగ్లేయులకును జర్మనీవారికిని పెద్ద యోడలుగలవు. పైసంగతులవల్ల 1786 సంవత్సరమునాటికి మిక్కిలి హీనస్థితియందుండిన అమెరికా క్రమక్రమముగ గొప్ప స్థితికివచ్చి యచ్చటి జనుల పరిశ్రమవల్ల ఉక్కు వ్యాపారముల బ్రసిద్ధికెక్కి, ప్రపంచములో అమెరికా ఉక్కురాజ్యమని పిలువబడుచున్నది. టెల్లిగ్రాఫ్ కచ్చేరీలో నల్పనౌకరుగనుండిన కార్నీజీ ఉక్కు వ్యాపారమువల్లనే బాగుపడి కోటీశ్వరుడై యున్నవాడు. స్వశక్తిని తమవృత్తులయందు మెలంగెడివారి యెడ కార్నీజీ దయామయుడై వారికి మహోపకారములను చేయుచున్నాడు. సోమరులకు కార్నీజీ ఎట్టిసహాయమును జేసియుండలేదు.



## 11. నాణెముల చరిత్ర.

పూర్వకాలమున నొకరివద్దనున్న సరకులను మరియొకరికిచ్చి మార్చుకొనుటవల్ల వర్తకము జరుగుచుండెడిది. ధాన్యమెక్కువయుండి బట్టలు కావలసినవారు బట్టలెక్కువ యుండి ధాన్యము కావలసినవారిని వెదకుచుండిరి. తర్వాత కొన్ని చోట్ల కూడలిగ నన్నిసరకులను చేర్చియుంచి కావలసినవారికి వారిచ్చు సరకులను బుచ్చుకొని వారికి వలసిన సరకుల నిచ్చు సాహుకారు లేర్పడిరి. ఈపద్ధతివల్ల సాహుకారున కెక్కువ లాభమును కొనువారికినష్టమునుకలుగుచుండెను. దేనియొక్క విలువ సాధారణముగ మారకుండి తరుచుగను సులభముగను జనులు వాడుకలో నుంచుటకు తగియుండి స్వతస్సిద్ధముగ నుపయోగార్హమై యుండునో అట్టి సామాన్య వస్తువునే సొమ్ముగ వ్యవహరింపసాగిరి. నగలకై యుపయోగింపబడి సాధారణముగ జీర్ణముగాని లోహపదార్థములు నాణెముల కెక్కువ అనుకూలమైనవిగ గనిపెట్టబడినవి. అదిగాక లోహములు చిక్కుట మితమైనందున వానిధర మారుటకవకాశము తక్కువగ నుండెను.

ప్రప్రథమమున లోహపుముక్కలను తూనికవల్ల వాడుచుండినను నాగరికతగల రాజ్యములవారు శీఘ్రకాలములో కొన్నిలోహములను వానియొక్కతూనిక, పరిశుభ్రత, కిమ్మతు

లనుబట్టి నాణెములకు ప్రసిద్ధమైనవిగ స్థిరపరిచి టంకసాలలందు ముద్రలు వేయుటకు ప్రారంభించిరి. ఇందువల్ల లోహములను తూచుటలో జరుగుదగాల కవకాశము లేకపోయెను. చీనావారు మొన్నటివరకు లోహములను తూచి వాడుచున్నారు. లోహములలో మార్పుచెందనివానికి ప్రాశస్త్యమెక్కువగలదు. బంగారము వెండి నికెలు రాగి మొదలగు లోహములు వరుసవెంబడి నధికముగా నెంచబడుచున్నవి. తయారుచేయబడు నాణెములలో వాని తూనికెకంటె తక్కువగ లోహము నుపయోగించుచున్నారు. అటుల చేయనిచో నాణెములను కరిగించి వాడుట కెక్కువవీలుగలుగును. గ్రీసుదేశస్థు లిట్టి పద్ధతి 2500 సంవత్సరముల క్రిందటనే యవలంభించిరి. ఆంగ్లేయులు 600 సంవత్సరముల క్రింద నాణెముల నాప్రకారము చేయ నారంభించిరి. ఒకప్పుడు కొన్ని రాజ్యములలో పన్నులవల్ల విశేషము సొమ్ము రాబట్టుకొనుటకు వీలులేనప్పుడు నాణెములందలి లోహములను మిక్కిలిగ తగ్గించుచుండిరి. అమెరికాలో వెండినాణెములందు లోహముచాల తక్కువగ నుండును. సాధారణముగ మంచిరాజ్యములలో నాణెముల నీప్రకారము నీరసపరుచుటకు ప్రయత్నములుజరుగవు. కొన్నిదేశములలో నాణెములకు కాగితముల నుపయోగించుచున్నారు. నూటికి తొంబదివంతులు ప్రపంచములోని వ్యాపారములు బ్యాంకిలవల్లను హుండీలవల్లను నిర్వర్తింపబడుచున్నవి. ప్రజలకు తమకెప్పుడు లోహరూపకమైన నాణెములు కావలయునన్న నప్పుడే రాగలవనెడు దృఢమైన నమ్మ



కము గలుగుటచేత నట్టికాగితవ్యాపారము సాధ్యమగుచున్నది అట్టి నమ్మకము లేనిచో వర్తకవ్యాపారములు కొనసాగుట దుర్లభము. ఇదిగాక నాణెములలో కొన్ని దేశములవారు బంగారమును కొందరు వెండిని హెచ్చుగ వాడుకచేయుటవల్ల బంగారునాణెములుగల దేశములతో వెండినాణెము ప్రామాణ్యముగాగల దేశము వర్తకవాణిజ్యములందు వెనుకబడుటకు సందియములేదు. ప్రపంచములో వెండికంటె బంగారము తక్కువగనుండుటచేత వెండికిధరతగ్గి బంగారముధర హెచ్చుగ నున్నది. 25 సంవత్సరముల క్రిందట చిన్నమువెండికి వచ్చెడి బంగారముకంటె నిప్పుడు చాల తక్కువగిట్టుచున్నది. అందుచేత చాలరాజ్యములలో వెండినాణెముల తగ్గించి బంగారపు నాణెములనే హెచ్చుజేయుచున్నారు.

అమెరికావారు కొంతకాలము వెండియొక్క ధర తగ్గకుండుటకు వెండిని విరివిగ కొని నిలవజేయగా నప్పటికిని తమ యుద్యమము కొనసాగక నాణెములలో లోహమును తగ్గించవలసివచ్చెను. రెండువిధములైననాణెములు నొక్కదేశములో ప్రామాణ్యముగ నుండుటకు వీలులేదు. ఆంగ్లేయులు మన హిందూదేశములో వెండినాణెము ప్రకారము గోధుమలను గొని తమదేశములో బంగారపునాణెముప్రకారము విక్రయించుటవల్ల చవుకగగొని లాభమునకమ్ముచున్నారు. అమెరికావారు పూర్వము వెండి నెక్కువగా నెగుమతి చేయుచుండ, నిప్పుడు బంగారము నెక్కువగ నెగుమతిజేసి వెండి నెక్కువ చేర్చుకొనుచున్నారు. వెండినాణెము దేశముయొక్కబీదస్థితిని

తెలియజేయును. అమెరికావారు హిందువులవలె వెండినాణెముల నెక్కువగ వాడినచో వారు చవుకగ నమ్మి ప్రియముగ కొనవలసినవా రగుచున్నారు. బంగారముకంటె వెండికి ధర హెచ్చుకలిగనేని వెండికే ప్రామాణ్యము నిలువగలదు. కాని బంగారమువలె వెండికి స్వాచ్ఛమును స్థిరత్వమునుకలుగజాలవు బంగారము హెచ్చిననే ధనము హెచ్చినటు లెంచదగును. పనివాండ్రకు వచ్చుకూలి బంగారపునాణెములలో గిట్టెనేని వారెక్కువ ధనికు లగుదురు. బంగారము ప్రపంచములో ననేకప్రదేశములలో వాడుకలోనున్నది. ప్రపంచములో వర్తకవాణిజ్యములందు ప్రఖ్యాతిగాంచి ఐశ్వర్యమున మిన్నంటిన అమెరికాదేశము బంగారపునాణెములనే ప్రామాణ్యముగ వాడుచున్నది. ఆరంభదశయందున్న వృత్తుల కెటులసంరక్షణపద్ధతి యవసరమో యటులనే వర్తకములో ధనము సంపాదించవలెనన్న బంగారము నాశ్రయించి వ్యాపారము జేయుటకర్తవ్యము. బంగారముచేర్చినవానికిభయముతో పని లేదు. వెండికిగలప్రమాదము లుండజాలవు. ధనికులైనవారికి తమ ధనము నెటుల కాపాడి యభివృద్ధికి తేవచ్చునో అట్టి పద్ధతులు సహజముగ తోచుచుండును. హిందూసుందరులు తమ నగలకని బంగారమును జేర్చియుండుటవల్ల వడ్డీ నష్టమును గలిగించి ధనమును వర్తకవ్యాపారముల సంచరింపకుండ బంధించినను దేశముయొక్క మూలధనమును మాత్రము నాశనము చేయుచున్నారనుటకు వీలు లేదు.

## 12. కోటీశ్వరులు.

ఐశ్వర్యమునకు నవీనకాలమున పుట్టినిల్లమెరికాయై యున్నది. అచ్చటనున్నంతమంది కోటీశ్వరులుగాని వారికికలిగినంత ద్రవ్యముగాని ప్రపంచములో నితరదేశములవారిలో జూడము. అట్టి మహాదైశ్వర్యమును సంపాదించుటకు వారి వర్తక వ్యాపారములే కారణములయియున్నవి. వర్తకాభివృద్ధివల్ల నొకదేశమునకు కోట్లకొలది రూపాయిలు లాభము వచ్చుటయును వృత్తులు నశించిన దేశములకు కోట్లకొలది నష్టమువచ్చుటయును దెల్లమయిన విషయమేగదా ? వర్తకసంఘములవల్లనే వర్తకాభివృద్ధి శాశ్వతమై స్థిరముగనుండగలదు. వందలకొలది సంవత్సరములనుంచి కొన్నితరములుగ నెడతెగకుండ నైకమత్యముతో భాగస్థులును వారి ప్రతినిధులును కార్యములను నెరవేర్చుచున్న వర్తకసంఘము లెచ్చట నుండునో యచ్చట లక్ష్మి నివాసమేర్పరుచుకొన్నను వింత లేదు. మఖలో బుట్టి పుబ్బలోమాడెడు వర్తకసంఘములు దేశానర్థకములయి లాభమెక్కడ సంపాదించ గలుగును ? అన్యోన్య ద్రోహచింతలేక పరస్పర లాభాపేక్షయున్న భాగస్థుల నడవడియే శ్లాఘాపాత్రమై యైశ్వర్యదాయకమగును.

వ్యాపారములందు వర్తకసంఘములలో స్వల్పభేదాభిప్రాయములు గలిగినను వాని నివారించి సంఘముయొక్క

పేరును ప్రతిష్టను నిలుపుటకు ప్రయత్నించుటకు మారుగ వానిని భగ్నముగావించి నష్టములబాల్పడి దివాలా జెందు సంఘముల నరుదుగ మనము అమెరికా మొదలగు కొన్ని దేశములలో జూచుచుందుము. వర్తక సంఘముల కార్యములను నిర్వహించువారియొక్క సామర్థ్యమును బట్టియే వాని జయాపజయములుండును. బుద్ధిశాలులును పట్టుదలతో బని చేయ నుత్సాహముగలవారును యంత్రశాలల కధిపతు లగుచున్నారు. అట్టివారిలో విద్యాధికులరుదు. పెక్కండ్రు పేదరికమునబుట్టి పెరిగినవారై యుందురు. వారిని తేనెటీగలకే పోల్చగలము. వారియొక్క యార్జనలలో జాలవరకు ధర్మార్థము వ్యయపడుటయే యందుకు నొకనిదర్శనము. వారిలో గొందఱి యార్జనను గురించి విచారించిన యెడల మనకు విస్మయము గలుగవచ్చును. నిమిషమునకు కొన్ని వేల రూపాయిల నార్జించువారుండుట వింత కాదా! అమెరికా సంయుక్త రాష్ట్రములలోనే 50 మందికి పైగా కోటీశ్వరులున్నారు. లక్షాధికారులన్ననో వేలకొలదిగలరు. ఆదేశమునందలి ధనములో నూటికి ముప్పాతికవంతు సీధనికుల చేతిలోనున్నది. 200 కోట్ల రూపాయిలుగల రాక్ఫెల్లరు నూరుకోట్ల రూపాయిలుగల కార్నెజీ కోటీశ్వరులలో ప్రముఖులయి యున్నారు. 64 కోట్లరూపాయిలుగల ఏస్టరు 50 కోట్లరూపాయిలుగల మారను రెండవతరగతిలోనివారై యున్నారు. కోటీశ్వరులలో 10 కోట్లరూపాయిలకు తక్కువ లేనివారే 20 మందిగలరు.



కొన్ని దేశములలో లుబ్ధాగ్రేసరులయి క్రమమయిన దుస్తులను ధరింపక సరియైన యాహారమును తినక దానధర్మము లెఱుంగని మూఢుల చందమున కొన్ని లక్షలు చేర్చి పిట్టపీగి తాము ధనము నెద్విధముగ సంపాదించినను ధనాంధముచేత నొడలు మరచి దురాగతములకు నుద్యుక్తులగువారిని కంచుకాగడాలు వేసి వెతకినను అమెరికాలో గనుగొనుట బ్రహ్మకయినను తరముగాదు. కొందరవివేకులు ధనికుడు దుర్మార్గవృత్తితో ధనమార్జించెనని యెఱిగియుండియు వానిపాదసేవజేసి ధనమార్జించుట కిచ్చగించెదరు. అమెరికాలో జేయబడు దానధర్మములు ఫలాపేక్షతో జేయబడుట లేదు. సాధారణముగా వర్తకవ్యాపారములలో శాశ్వతమయిన లాభము మంచినడతవల్లనే వచ్చునుగాని దుర్మార్గక్రియలచే నార్జింపబడు ధనమొక్కతరము దాటుటరుదు. ధనార్జనకై ప్రపంచములో నబద్ధముచాలవరకు హెచ్చుచున్నది. మంచినడతలేనివాని యైశ్వర్యము వానిశరీరమునకుగాని మనస్సునకుగాని సంతోషము నివ్వక యాధనమే యతనికి ననేక విరోధులనేర్పరచి యిక్కట్టులపాలుజేయును. ఏదేశమునందయినను కోటీశ్వరు లుండవలెనన్న సత్యమును ముందుగా కాపాడవలెను. తరువాత వర్తక విధానంబుల మెలగవలెను. ఇతర వృత్తులవల్ల జీవయాత్ర సలుపవచ్చును. లేనియెడల కొన్ని లక్షల జేర్చవచ్చును. కోట్లు కావలెనన్న వర్తకమే శరణ్యము. లంచములు బుచ్చుకొనువారు లక్షాధికారులగుటయే దుర్లభము. పెద్దజీతములను బుచ్చుకొనువా

రల్ప బుద్ధులుగారు. కొద్ది జీతగాండ్రలో లంచగాండ్లకుంగల సంపాద్యమల్పమై వారి బుద్ధులకు దగియుండును. అత్మ గౌరవముతో నబద్ధముల కవకాశమివ్వక వృత్తులను ప్రోత్సాహపరచి కోటీశ్వరులై దేశైశ్వర్యమును స్థిరపరచగల మహనీయులను సంస్తుతించుట మనకు విధియైయున్నది.

కేవలము వ్యవసాయమునందేయుండి వ్యాపార మెరుంగని వారికంటె పల్లెలను వదలి పట్టణములకుజేరి ఖాయిదా వర్తకములను ప్రారంభించిన వారెందరు మేడలు మిద్దెలు గట్టుచు లక్షాధికారులని ఖ్యాతివడయుచుండుట మనము జూచుటలేదు ! 60 నెంబరు నూలునకు మించిన నేతపనులు జేయు సాలీలు ధనికులై వ్యాపారములం దభివృద్ధిగాంచుచుండ నంతకు తక్కువనెంబరునూలు నాశ్రయించువారేల పేదలుగనున్నారో కనుంగొనుడు. వీరిలో బరులపై భారమునువైచి కర్రపెత్తనము చేయువారికంటె కాయకష్టముజేయుచు తమ వ్యాపారములను స్వయముగ నెరవేర్చుకొనుచున్న వారే స్థిరమయిన సంపదనుబొందుచున్నారనియు నెదుటవానిమోసముజేయు తలంపుగలవారున్న సంఘములు శీఘ్రకాలములో న్యాయసభలకు బోవుచుండుటయు పరస్పర నమ్మకము గలుగునటుల సంచరింపకబోవుటవల్ల సంఘమునకును తమకును శాశ్వతమయిన నష్టమునుగలిగించు మహానుభావులెందరో నుండుటయు నాంధ్రులకు తేటతెల్లమయియున్నవి. కొంపకు జిచ్చువెట్టునట్టి కిరాతపుపనులు మదమాత్సర్యముల చేత నొండొరులను సాధింపవలెనను దలంపుతో మూలచ్ఛే



దమునైనను గావించును. తననష్టమెటులున్నను తనవిరోధికి నష్టముకలిగెనని సంతసించు మహాపాతకు లేదేశమునందు విశేషముగనుందురో యాదేశమువర్ధిల్లజాలదు. సంఘము చెదరకుండనుండ దాని మూలధనము హెచ్చును. సంఘము చెదరిరికి వారేమైనచో వారిలాభము తగ్గిపోవును.

పాశ్చాత్యులలోగల విశేషమొకటి గలదు. తమకు ప్రత్యేకించి నష్టమువచ్చినను సహించెదరుగాని తమ సంఘమునకుగాని దేశమునకుగాని యాపదవచ్చునన్న సహింపజాలరు. అట్టిచో తమలో తమకు గల తగవులను స్వయముగ గాని పంచాయతీ వల్లగాని నిర్ధారణ చేసికొనుచు వ్యాపారసంఘముయొక్క పేరునకపకీర్తి మాత్రమురానివ్వరు. అట్టి సహనశక్తి లేనిచో కోటీశ్వరు లగుటకు బునాదియే లేదు. కీర్తిధనమును సంపాదించగలదుగాని ధనమెన్నటికిని కీర్తిలేనివానికి కీర్తి నివ్వజాలదు.

అమెరికాదేశపు వర్తకులలో గోటీశ్వరులైన వారు తమ మంచి నడతవల్ల ధనము సంపాదించుటయే గాక యాధనమును తగిన విధమున కర్చుజేయుట యందు నధిక కీర్తినిపొంది యున్నారు. అమెరికా వారి ధర్మములు వారి ఖండమునందే గాక ప్రపంచ మందంతట వ్యాపించి యున్నవి. అనేకమంది యాంధ్ర యువతుల సుఖప్రసవమునకును మాతా శిశువుల యారోగ్యమునకును నాలవాలమై గుంటూరులో వెలయుచున్న వైద్యశాల యేమి యచ్చటి పాఠశాల యేమి అమెరికా

వారి యౌదార్యమువల్ల నేర్పడినవే గదా! ఎనిమిదివేల మైళ్ల దూరమునందున్న అమెరికను లాంధ్రుల కేకారణము చేతనైన నేమి యే నమ్మకముతో జేసిన నేమి లక్షలకొలది రూప్యములను కర్చుపెట్టుటకు వారికి గల యైశ్వర్యమే కదా ముఖ్యకారణము. కొన్ని వేలనుజూచుకొని గర్వపడి తమకంటె ప్రయోజకులు లేరనుకొను యంబ్రహ్మ లమెరికావారి నడవడిని జ్ఞప్తి యందుంచుకొని యేదో సాకు జెప్పుచు గాని మఱియొక విధముగ గాని పదిమందికుపకరించు పనికి ధర్మమివ్వక నుపేక్షించుట మాని ధర్మాచరణయందు బ్రవేశించుటయు సద్బుద్ధితో సన్మార్గమున నడచుచు తమ వృత్తులయందు లక్షల కొలది సంపాదించి కోటీశ్వరులగుటకు ప్రయత్నించుటయు కర్తవ్యమని తెలిసికొని జాగ్రతతో సంచరించెదరు గాక.



